క్యాలికోబయిండు నవరసభరితమగు సాంఘిక నవల. డెమ్మీ 272 పుటలు

# ప్రేమసుందరి

గ్రంథకర్త:—చిర్రావూరు కామేశ్వరరావుగారు, బి. ఏ.

ఆంధ్ర సారస్వత నందనోపవనమున వికసించిన తరుణ పుష్పము! దివ్యసౌర
సంకలితము! ఆంధ్రులారా! హృదయాకృష్ట కరమగు నీ సుమరసంబును గ్రోలుండ
ప్రేమసుందరి ప్రేమ సందేశము—ముక్తకంఠమున—నివేదించుచున్నది! శ్రుతిసు
కరమగు నాదివ్యసందేశము నాలింపుఁడు:—

రుధిర ప్రవాహమున జ్వలితాగ్ని జ్వాలవలె మండిపడు నల్లాయుద్దీన్ సా
ఖాముని రుధిరశాసనప్రచారము—బర్బర యవనశాసనా బద్ధుఁడై కఠోరయాతన న
భవించిన కదంబుని హృదయపరివర్తనము, పవిత్ర జీవన చరిత్రము—సాంఘిక
ధకారమున జనించి, దుఃఖసముద్రతీరమున సహాస్యవదనయై జీవనవ్రతోద్యాపనమ
గావించిన పాతభాగిని యగు భాగ్యవతీ దుఃఖగాథ—జీవితద్వారమున నశ్రుకలుషి
నేత్రయై యలజడినడి కడకు ప్రేమరాజ్యమున రాజ్యేశ్వరియైన ప్రేమసుం
సుకుమారలీల—ఆంధ్రగౌరవ పతాకమును రక్తరంజిత రణరంగమున శత్రువీరుల
దుర్నిరీక్ష్యముఁ గావించిన ప్రసన్నకుమారుని, అగర్భవీరుని, బిరుదు మగంటివి—
రాధామణీహారి ప్రసాదుల నిరంకుశ కుటిలప్రవర్తనము—ప్రణయప్రమదావన
వసంతకోకిల—రూపచంద్రుని ప్రణయప్రబోధవాణి, కరుణారాగాత్మకంబగు జీ
సంధ్య—అస్వార్థగుణమయి యగు ప్రఫుల్లకుమారీ నిర్యాణము—క్షణభంగుర మ
పవని నమ్మకొని, కర్మదీక్షాపరతంత్రుఁడై హృదయరాజ్యమున కేడమై, కడ
నాత్మహత్యఁ గావించుకొనిన యవనరాజప్రతినిధియగు ఖుస్రూమలికుని నిర్దాక్షి
ప్రసంగము—ఆంధ్రమహారాజుల భుజపీఠమున విరాజిల్లిన విజయలక్ష్మీవి
సము—చదువరుల హృదయములను రసభావపూరితముఁ జేయుకపోవు!

పోస్టేజీగాక వెల: చందాదారులకు రు 1-0-0. ఇతరులకు 1-8-0.

సరస్వతీ గ్రంథమండలి,
రాజమహేంద్రవరము.

(1923)

సరస్వతీగ్రంథమండలి; నాటకానుబంధములు 1.



# మార్కండేయ నాటకము.





గ్రంథకర్త:-

పింగళి వేంకటనరసయ్యగారు.

39466

1 St. Edition; 1923.

20-1-90

ప్రకాశకులు:-
అడ్దేపల్లి లక్ష్మణస్వామి,
సరస్వతీగ్రంథమండలి.
రాజమహేంద్రవరము.



సర్వస్వామ్యసంకలితము

వెల 0—12—0

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.

బ్రహ్మ సృష్టికర్త
2 ద్వారపాలకులు బ్రహ్మమందిరముకడ నుండువారు
మృకండుడు మార్కండేయునితండ్రి యగువాని
ఇద్దఱుమునులు మృకండమిత్రులు
నారదుడు త్రిలోకసంచారి
మృకండశిష్యుడు మునికుమారుడు
కణ్వుడు ఒకానొకఋషి
భట్టోజీదీక్షితులు } కాశీపురవాసులగుబ్రాహ్మణులు
వేంకటచైనులు }
శారద్వతుడు }
మైత్రేయుడు } కణ్వశిష్యులు
గాలవుడు }

39466
20-1-90

మార్కండేయుడు మృకండునికుమారుడు (శివపూజాధురంధరుడు)
విశ్వామిత్రుడు బ్రహ్మర్షి
వసిష్ఠుడు దేవర్షి
భృంగిరిటుడు ఈశ్వరదూత
శంకరుడు కైలాసవాసుడు
దీర్ఘకర్ణుడు } మార్కండేయునికొఱకంపఁబడినయమదూతలు
వక్రనాసుడు }
యముడు పాపులశిక్షించువాడు
చిత్రగుప్తుడు యమలోకమందలిలెక్కలువ్రాయు కరణము
మఱికొందఱు యమభటులు

స్త్రీలు.

సరస్వతి బ్రహ్మరాణి
గౌరి శంకరుదేవి
మరుద్వతి మృకండుపత్ని
ఇద్దరుఋషికాంతలు మృకండుపర్ణశాలకేతెంచినమార్గస్థులు

N.B. లెక్కకెక్కుడైనను నిరువదిమందిలో నిరభ్యంతరముగఁ బ్రదర్శింపవచ్చును

# విజ్ఞప్తి.

పూజ్యులగు భాషాభిమానులారా !

చ. ఎఱుఁగను లక్షణం బనఁగ నెట్టిదొ కావ్యపురాణ గాథలన్
బరిచయ మింత లేదు పొరఁబాటులు మెండుగ నుండవచ్చు ధీ
వరులకు మెప్పుఁ గూర్పఁ గలపాటి రసజ్ఞత యేనిఁ గానరా
దరయఁగఁ గాని సౌహృద యుతులై తిలకింతు రటంచు వ్రాసితిన్.

ఇయ్యది లిఖితరూపమున నాయనుమతిఁ గాని ప్రకాశకుని యనుమతిఁ గానిగైకొనక ప్రదర్శింపఁబడఁ గూడదు.

ప్రదర్శనానుకూల మని యెంచిననాటకసమాజికులు, తాము వలసినవిషయముల నా కెఱింగింతు రేని కృతజ్ఞుఁడనై ప్రత్యుత్తర మంపింతును. నారదపాత్రకు ఆయాస్థలములందు, "భజగోవిందం" అని ముద్రించి వరుసనెంబరులు గల అనుబంధములలోఁ జేర్చినప్రదేశములకడ భజగోవిందశ్లోకములు పఠించునది యని కోరుచున్నాను.

ఏలూరు.<br>
17-5-23.

ఇట్లు<br>
పింగళి వేంకటనరసయ్య.

# కృతిసమర్పణము

శా. శ్రీ కారుణ్య పయోనిధిన్, విజయ లక్ష్మీ నాయకున్, వైరిమ
ర్దీకారణ్య దవానలాయిత ఘనశ్రీ విభ్రమాకర్షునిన్
గాకుస్థాన్వయ దుగ్ధ వారినిధి రాకా పూర్ణ శీతాంశు స్వ
శ్లోకా రాతి నిశాచ రాంతకుఁ గృపా లోలాత్ము సేవించెదన్.

క. రామా! జగదభిరామా! రామా!
సుగుణాల లామ రాజుల
లామా! రామా! త్రిజగన్నుత సుత్రామా!
కృతి నందుకొనవె రఘువంశమణీ!

ఉ. భక్త వశీకృతుండును గృపాపరతంత్రుఁ డటంచుఁ బల్కు నా
ర్యోక్తులు నెమ్మదిం దగుల నో రఘువంశ శశాంక నేను నీ
భక్తుఁడనై తరింపఁగ నుపాయ మిఁకొందు గ్రహింప రామి, నా
శక్తి కొలంది నీసుమ మొసంగెద మంగళ మూర్తి రాఘవా!

మ. శివ చారిత్ర మటన్న, సంతస మెదన్ జెల్వారఁ గాఁ దత్కథల్
శ్రవణానందముగాఁగ విందు, వను పాశ్రస్త్యంబు నన్ నీకు నీ
శివ లీలాత్మక మైన కబ్బముఁ గృతిన్ జేకూర్చితిన్ భక్తుఁడన్.
భవ బంధంబులఁ ద్రెంచి బ్రోవుము కృపా పారీణతన్ రాఘవా!

గీ. తప్పులే కలవో! లేక యొప్పులే క
లవో! విమర్శింపఁ జాల మేల్తళుకు రన్న
మైన నొక గ్రాజు రాయి యైనను, సమాన
భాజనముఁ గాదె? నీసృష్టి పథము నందు.

యుష్మచ్చరణదాసుఁడు.
పింగళి వేంకటనరసయ్య.

# తప్పొప్పుల పట్టిక.



| పేజీ. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| తిసము | | | |
| ాము | | | |
| తము | 2 | లహో | లవో |
| 3 | 10 | విభాండుని | పవిత్రుని |
| 8 | 1 | ఇంతకుమున్నిర్వుర | ఇంతకుమున్నిర్వురు |
| 12 | 7 | పూర్వపుణ్యముండి | పూర్వపుణ్యముండిన |
| 13 | 19 | ఆయుర్ద్దాయువు | ఆయుర్ద్దాయము |
| | 24 | పూజ | బూజ |
| 26 | 14 | సకృతాత్మ | సుకృతాత్మ |
| 27 | 16 | మృకండాశ్రమంబు | మృకండ్వాశ్రమంబు |
| 30 | 13 | స్వర | స్వర్థ |
| | 25 | బలుకుదురె ? దీనికిన్ | బలుకుదురె ? దీనికింపగు |
| 33 | 25 | మృకండా | మృకండ్వా |
| 36 | 10 | గణితవయనకు | గణితవయసకు |
| 41 | 2 | విభాండకుమారా ! | మృకండా ! |
| 47 | 22 | నమతకంఠేశ్వరుఁడు | నమృతకంఠేశ్వరుఁడు |
| 49 | 26 | కికరుల | కింకరుల |
| 54 | 2 | మీశ్వరాఘన | మీశ్వరాధీన |
| | 3 | దిపుర | ద్రిపుర |
| | 15 | ఇంకనుపోయెన | ఇంకనువాపోయెన |
| 57 | 10 | విచారిచెపఁబిలిపిపుము | విచారించెపఁబిలిపింపుము |
| | 14 | వీరుగోపేత్రలు | ఇరుగోపేత్రలు |
| 58 | 22 | దారల | దారను |
| | 25 | నొప్పురా ? | నొప్పెరా ? |

| పేజి, | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 59 | 2 | తలంచితిమో | తలంచితివా |
| 65 | 21 | మారేడుదళమే | బిల్వపత్రిమే |
| 67 | 9 | రయోరీకి | రయోరిరి |
| | 14 | యుమామహేశ ! నోజ | యుమామనోజ ! |
| | 15 | పురష | పురుష |
| | 18 | హృదయయును | హృనయమును |
| | 22 | సీయామిాటలు | నీయామాటలు |
| 71 | 19 | నిన్నుప్పుడే | నిన్నిప్పుడే |
| 74 | 18 | పిడుగో | ఇదుగో |
| 75 | 11 | తాపకినాను | తావకీనాను. |



"శ్రీరామచంద్రపరమాత్మనేనమః"

## (నాంది)

---

శా. శ్రీకంఠుండు సమస్తలోకజనసం సేవ్యుండు భక్తావన
శ్రీకళ్యాణచణుండు మానితదయా సింధుం డుమాభర్త గం
గాకల్లోలవతీలసచ్ఛిరుఁడు మార్కండేయసంరక్షణ
స్వాకారప్రభ నిర్జితాంతకుఁడు మీ కైశ్వర్యముల్ గూర్చుతన్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూ:—ఆహా! ఏమి నాభాగ్యము.

గీ. సత్యవాక్యంబు పగిది నిష్కలుష మగుచు
సజ్జనుని మానసంబటు చల్ల నగుచు
నిరుపమానంద సంధా నకరణి సరణి
నలరుసభఁ గాంచ దృక్పర్వ మగుచు నుండె.

కాలహరణ మేటికి (తెరవంకఁజూచి) మారిషా! యిటురమ్ము.

మా:—(ప్రవేశించి) బావా! ఏమినెలవు?

సూ:—సకలకలాప్రవీణు లగుసీసదస్యుల నీక్షించుచుండియు, "ఏమి నెల"వని యడుగు చుంటివా?

మా:—శ్రీతిరుపతివేంకటేశ్వరులశిష్యుం డగుపింగళి వేంకటనరసయామాత్యుఁడు రచించిన మార్కండేయనాటకప్రదర్శనమునకు, వలయుపాత్రల నలంకరింప నియమించితిరి కద?

సూ:—అగును. తగినయేర్పాటులఁ జేసితివా?

మా:—సర్వము సమకూర్చితిఁ గాని, తమచే గారవింపఁబడుచున్న, యానందుఁడు, వైరిప్రేరేపణమునఁ బ్రతికక్షి యై, మనప్రదర్శనము విఘ్న మొనర్ప యత్నించు చుండినట్లు వింటిని.

సూ:—అతఁ డట్లగువాఁ డని, యీవఱకే యెఱుంగుదును. అందుచే

తనే గౌరవించు చుంటిని. దుష్టులతోఁ గలహించుటకంటెఁ జెలిమి యొనర్చి సాధ్య మైనంతవఱకుఁ సన్మార్గమునఁ బ్రవేశపెట్టు టుచిత లక్షణముగద ! కానిమ్ము యెవనిదుర్మార్గము వానినేజెరచును. ధర్మపక్షపాతి యగుభగవంతుఁడు లేఁడా? ఇంక నీ వరిగి, మార్కండాదిభూమికల బ్రహ్మలోకమునఁ బ్రవేశపెట్టుము. నే నింతలో సర్వకార్యసిద్ధి కై, కవియిష్టదైవమును సంస్మరించి వచ్చెద.

మా:—చిత్తము. (నిష్క్రమించును.)

సూ:—(అంజలిఘటించి)

మ. దురహంకారరజస్తమాదిఖలచిత్తుల్ గాంచఁ గా లేనిభీ
కర మై దీసజనౌఘరక్షణకళా ఖండప్రకాశంబు నై
స్థిర మై పాపలతాలవిత్ర మయి దే దీప్యప్రభాపూర్ణ మై
పరగన్ లోకము లేలునీకరుణ మా పైఁ జూపవే ! మారుతీ !

(నమస్కరించి, నిష్క్రమించును.)

ఇది ప్రస్తావన.





"శ్రీరామచంద్రపరమాత్మనేనమః"

# మార్కండేయ నాటకము.



(ప్రథమాంకము. 1 వ రంగము.)

(సత్యలోకము, బ్రహ్మమందిరము.)

(ప్రవేశము మృకండమహర్షి, మఱియు నిద్దఱు)

(అనుబంధము-1)

ఋషులు:—(1-2 తో) (మృకండుఁడు) ఓహో ! బ్రహ్మమందిరద్వారమును సమీపించితిమి.

ద్వార—:మహానుభావు లగుసంయమీంద్రుల కభివాదము.

ఋషు:—కళ్యాణం భూయాత్

ద్వార:—మహాత్ము లరుదెంచుటకుఁ గారణ ముండకమానదు.

మృకం:—సర్వజగదుత్పత్తి, స్థితి, లయకారణభూతుఁ డగు, పరమేష్ఠి, దర్శనము ననానందించుటయె.

ద్వార:—మహాభాగ్యము. నిరాటంకముగఁ బోయి దర్శింపుఁడు

[తలుపులు దెరవఁబడును, తెల్లతామరగద్దెపై సరస్వతీచతుర్ముఖులు గోచరింతురు, వారి కెదుట నొకగంట (వ్రేలాడు చుండును)

ఋషు...సత్యలోకేశ్వరా ! వాణీమనోహరా ! నమస్తే! నమస్తే !
(అని యిద్దఱుమునులు లోనఁ బ్రవేశింతురు, మృకండుఁడుఁ జనఁబోవ, (వ్రేలాడుగంట మోగును]

ద్వార:—(మృకండునాపి) మౌనివరా! క్షమించి, యిచ్చట నేయాగుఁడు.

మృకం:—(వెల్లఁబోయి) కారణ మేమి ?

ద్వార[1]:—"అపుత్రస్యగతిర్నాస్తి" అను నార్యోక్తి దామెఱింగిన దేకద? అట్టిసంతానహీను లరుదెంచి, యీపవిత్రద్వారము దాట నెంచినపు డీగంట, తనంతఁ దానె మ్రోగుచుండుటయు, మేమవ్వారి నడ్డగించుటయు, స్వభావము. ఇప్పటిని నాదసూచకమున, మీరట్టి వారని, పోవల దని కోరుచుంటిమి. దయ యుంచి, తా మావలిగు మ్మముకడ నిలువుఁడు.

మృ:—(ఖిన్నుఁడై యావల కేఁగును)

బ్రహ్మ:—(లోని కేఁగినవారితో) ఓహో! పరమతపోధనులా! విచ్చేసి, సుఖాసీనులు కండు.

ఋషు:—(కూరుచుండురు)

బ్రహ్మ:—భవత్సంకల్పితసకలకార్యములుఁ జక్కఁగ నెరవేరుచుండెనా?

ఋషి [1]:—సకలలోకకళ్యాణానుసంధాయి వగుచతుర్ముఖుఁడవు, నీవు, నీసంతతిని, సహస్రనేత్రములచేఁ గనిపెట్టుచుండఁ గొఱంతలు గలుగునా ?

బ్రహ్మ:—ఇదంతయు ననిర్వాచ్యతపోమాహాత్మ్యము. మనీషాగరిష్ఠులుఁ గొందరు, మృత్యువు నరిఁగట్టి, బ్రహ్మానందమునఁ దేలియాడుటకుఁ గూడ, నియ్యదియే కారణభూతము. పెక్కుయుగంబులు మార్పడినను, నిశ్చలతపస్సమాధి నుండు దేహికి మాత్రము భిన్న ముండదు. లీలామాత్రముగ నవస్థాభేద మొదవు చున్నను తుట్టతుద కట్టివారికే, మహోత్కృష్టపదవి సిద్ధించును. ఇఁకముందును మీ కవిఘ్నముఁలగుఁగాక.

ఋషి [2]:—భగవదాశీర్వాదము, వరప్రసాద మై విరాజిల్లును. మా కింక సెల వొసంగి, కాపాడుచుండుము.

(యిర్వురు నమస్కరించు చున్నట్లును, బ్రహ్మ యాశీర్వదించు చున్నట్లు నుండఁగ——తెరపడును)

2 వ రంగము (ప్రవేశము మృకండుఁడు.)

నుబంధము-2) కట్టా! పూర్ణసంతోషమున మిత్రులం గూడి, సమదర్శింప నేతెంచిననా కెట్టిపాటువాటిల్లె ? నేఁ డెట్టిదుర్ది ఇంతటిదురంతసంకల్పవినాశన మొదైనఁ గలదా? ఛీ! ఛీ! కా! సిగ్గులేక, తగుదుమనని, జీవచ్ఛవంబ నై, సాటివారిలోఁ త్తి, యెట్లు సంచరింపఁ గలవు ? సతీశిష్యులమోము లెట్లు గలవు ? సత్యలోకవిశేషముఃల వినఁగుతూహల యగుసహ ంణి కీదుస్సహరపరాభవ మె ట్లెఱింగింపఁ గలవు ? చిరతప స్యాయపరుఁడును, సకలముని జనస్తవ్యభవ్యచరిత్రుఁడును ంభాంశునిపుత్రుఁడ నై జన్మించి, తాండవలీలానందహృన్మం ను, దుస్తరకలుషారణ్యవీతిహోత్రుఁడును, దీనజనావనదీక్షా ణుఁడును నగు,గిరిజామనోహరుచరణసరోజము లత్యానంద బసితనంబునుండి సేవించుచున్నను, కళంకమై, హేయమై, నమై, దుస్తరమై, దురంతదుఃఖభాజన మైన, సంతానహైన్య ాతకకూపంబునుండి తప్పించుకొనలే నైతిఁ గద ; (కొంచె ఓహో! ఏమి నానిష్ప్రయోజనవాక్సంధానము ? జన్మాం ృతపరిపాక మనుభవింపకమానునా ? తప్పదు. ఎంత కైన, ననుల్లంఘనీయము (ఇంచుక నే పాఁగి) ఔరా ! ఎంతసరి ానినను, బ్రహ్మను సేవించి, నా తెరం గరియవచ్చు, పుణ్యా త్రిద్వయముం గనినంతనె, వెండియు నాసంతాపాగ్ని రవు మనా ? వారినిష్కళంకదృక్ప్రసారమున, నీనామరదృష్టశరీర ము, నిట్టనిలువున దగ్ధ మైనను మానెఁ గాని, గోరుచుట్టుపై పోటు ననుకరించు నిప్పటి మిత్రసందర్శనమునకుమాత్రము మట కష్టము. (తెరలోఁజూచి) సహావాసు లరుదెంచు చున్న ఓహ్హృదయమా! నీ వింకనుఁ బగుల కుంటి వేమి.

(అనుబంధము-3) (నిష్క్రమించును)

3 వ రంగము (అరణ్యము, మృకండాశ్రమము మరుద్వతి, శిష్యుఁడు గూరుచుండి యుందురు)

శిష్యు:—అమ్మా ! కురంగపోతముల కాహార మొసంగి వచ్చెదను

మరు:—పోయి రమ్ము.

శిష్యు:—(నిష్క్రమించును)

మరు:—(లేచి, యాశ్రమముఁ బరికించి) కట్టా ! నాథుఁడు లేనికుటీర మెంతశోభావిహీనముగ నున్నది ?

సీ. అరవిందబాంధవుం డపరవారిధిఁ గ్రుంకఁ
గళలేనిపద్మినీ కాంత సరణి
కీరమ్ము లేకశృంగారమ్ముఁ గోల్పోయి
పరికింపరాని పంజరము కరణి
శతపత్రయుత సరోజము లేక వెలవెలఁ
బారుచుండెడిసరో వరముభాతి
నాయకమణి లేక హేయ మై కనుపట్టు
రతనాలతార హారంబు లీల

గీ. పల్లవము లేనిమందార వల్లి పగిది
రసము లే నట్టి కావ్యంపు రచన యట్లు
ప్రాణపతి బ్రహ్మ సేవింప నరుఁగు కతన
బాడువారిన దయ్యె నీ పర్ణశాల.

(నిటూర్పు పుచ్చి) అబ్బా ! ఏవియోగమైన భరింపఁ వచ్చుఁ గాని, పతివియోగము దుస్సహము. మఱియు,

మ. అతిభాగ్యాంచిత మైన వంశమున జన్యంబై నఁ గానీస మా
హితశుద్ధాంత నివాస మబ్బిననుఁ గానీ రూపరేఖాకళా
న్వీత యంచు నుతి కెక్కఁ జాలిననుఁ గాని శ్లాఘ్య మై తాఁబతి
వ్రత కాకుండిన నట్టిసంపదలసత్త్వం బెల్లఁ శూన్యంబగున్.

అని వచించు ధర్మశాసనతానిబద్ధమానస నగు నే నేరీతి నైపఁగలను? చతురాననదర్శనోద్భూతపరమసంతోషస్వాంతుఁ డగు, ప్రాణేశ్వరుఁడు వచ్చునంతదనుక నేమునిపత్నులతో నైనఁ గాలముఁ గడపుద మన, సమీపాశ్రమము లరు దయ్యె. సత్సహవాసమున కై దూరమును లెక్కింపక, యుటజమును విడిచి పోవుద మనిన, భాగ్యవశమున నేయభ్యాగతి యైనఁ జనుదెంచి, కుటీరమున నెవ్వరుఁ గానరామి, వేరొకచోటి కరగిన, తదాతిథ్యసత్కార్యాచరణమునకుఁ వెలి నై, గృహస్థాశ్రమధర్మోల్లంఘనమహాపాపఫల మనుభవింపవలసినదాన నగుదుఁ గాన, నాథునిరాకకు క్షణములు లెక్కించుకొనుచు నీవన్యమృగములతోడనే కాలముఁ గడపెదఁ గాకఁ [కూర్చుండఁబోయి, నిరూపించుచు] ఆహా! ఏమినాభాగ్యము! ఎవరో ఋషిసువాసినులు, యీమార్గమున నే దయచేయుచుండిరి; వీరి కాతిథ్య మొసఁగి, కృతార్థురాల నయ్యెద.

(ప్రవేశము, మునికాంత లిర్వురు)

ము. కాం:—(1) అక్కా! ఇది యొకమున్యాశ్రమమువలె నున్నది! ఇందలి సాధ్వి నడిగి, దాహశాంతిఁ జేసికొందము రమ్ము.

(2) మంచిది (సమీపించుచుందురు)

మరు:—(ఎదురుగావచ్చి) అక్కలారా! విచ్చేసి, యీవ్యాఘ్రాజినము నలంకరింపుఁడు.

(1) (2) [ కూరుచుండి] చెలియలా! నీవునుఁ గూరుచుండుము.

మరు:—[కూరుచుని] [అనుబంధము—4] లతామతల్లుల కైన యుగ్రతాపము, కడు బడలిన ట్లుంటిరి! తాళవృంతముతో, నించుక విసరెద. విశ్రమింపుఁడు.

ము. కాం:—[2] సోదరీ! ఇచ్చటిలతావితానము లే శ్రమ నపనయింపుచున్నవి. కొంచెముదాహ మగుచున్నది. మంచినీ రొసఁగుముమాకంతియే చాలును.

మరు:—అలాగే యిచ్చెదను [అనిజలములఁ గొనివచ్చి యిచ్చును]

ము. కాం:—[1] అమ్మా! నీనాథుఁ డెం దరిగె?

మరు:—పరమేష్ఠిని సందర్శింపసత్యలోకమున కరిగిరి.

శిష్యు:—[ప్రవేశించి] అమ్మా! హరిణములఁ గడుపునిండ మేపి వచ్చితి.

మరు:—మంచిది.

ము. కాం:—[1] అమ్మా! ఈతఁ డొక్కరుఁ డే కుమారుఁడా?

మరు:—[చిన్నబుచ్చుకొని] అమ్మా! నే నంతటిభాగ్యమునకు నోచుకొన నైతి నితఁడుఁ బుత్రప్రతిమానుఁ డగు' శిష్యుఁడు.

ము. కాం:—1-2 (జలపాత్రల దిగవిడచి, లేచి) ఏ మేమి ? నీ వనపత్య వా ? ఎంతభాగ్యమున్నను, యెన్ని సంపదలున్నను, యెంతటివి ద్యాబలపరాక్రమము లున్నను, యెంతసత్కర్మానుష్ఠానతత్పరు లైన ను, సంతానహీను లైనచో నవన్నియు, నానావిధకీచకగుల్మలతా తరువితానఘోరారణ్యప్రదేశమునం బ్రసరించు చంద్రకిరణములభా తి నిష్ప్రయోజనం బగు. అట్టివారిచేతినుండి, తృణ మేని గ్రహింపఁ దగదు. (నీటిపాత్రలఁ జూపుచు)కలశములఁదీసి జాగ్రత్తఁబెట్టుకొ మ్మా. [యిరువురునిష్క్రమింతురు)

మరు:—(నిర్ఘాంతపడి జూచి] [అనుబంధము-5] ఆహా! ఎంతపరాభవ ము! సాటివారిలో నా కెంతచిన్నతనము! గొడ్రాలనునీచవాక్య మున కే నెట్లునై పుదు? అయ్యో! సహింపక చేయున దేమి?

చ. పడతుక నాచుఁ బుట్టుటయె పాపము పుట్టినఁ గొడ్డురాలుగాఁ బుడమిఁ జరించుకంటె వన భూమినిఁ దా నొక మోడు మ్రాకుగాఁ బడుట సమంజసంబు జనవంద్యుఁడు గాఁడె మృకండుఁడన్న పే ర్వడసిన వానిభార్య కిటు వంత ఘటిల్లె నిఁ కేమిసేయుదుర్.

కట్టా! నాయీకళంక మెంతవిచారముఁ గూర్చుచున్నది! దాహబా ధచే నీమునిపత్నులు మాయాశ్రమమున కరుదెంచుట సంతోష మే యైనను గుశలప్రశ్నల నామానసముఁ గలఁగించి, కడునీచురాల వని, జలంబులఁ బరిత్యజించి పో నేల ? ఈఘోరనరకకూపమునుండి

తప్పించువా రెవరు? ఔరా! పరమేశ్వరులీల లెంతమరవగాహము
లు, ఎంతచిత్రములు.

(అనుబంధము-6)

శిష్యు:—అమ్మా! అలవిగానిదాని కై విచారించినఁ బ్రయోజనమేమి?
నేఁ జని, పూజాద్రవ్యములఁ గొనివచ్చెద, దేవతారాధనకు సమయ
మగుచున్నది.

మరు:—బిడ్డా! కొనిరమ్మా.

శిష్యు:—[నిష్క్రమించును]

మరు:—ఇఁక విచారించిన లాభ మేమి? నాథుని యాగమనమునకు
నిరీక్షించుచుఁ, నిష్టదేవత యగు, గౌరినిఁ బూజింప నేఁగెద. (అని
వెళ్లఁ బోయి, ధ్వని నాలించుట నటించుచు) ఆహా! ఎచ్చటనుండి
యో, విచారగ్రస్త మగు, కంఠరవము వినఁబచ్చుచున్నదే! (చూచు
చుఁడ)

మృకం:—(ప్రవేశించుచు) (అనుబంధము-7)

మరు:—(సంతోషాశ్చర్యఖేదములతో) అయ్యో! ఇ దేమి? దేవా!
పరమేశ్వరసేవాసముత్పన్నసకలకళావిభాసురం బగుభవన్ముఖచంద్ర
మండలము, శోభారహిత మై యుండుటకుఁ గారణ మేమి? యీ
విచార మేల?

మృకం:—(స్వ) కష్టా! ఏ మని వచింతు?

మరు:—ప్రాణేశ్వరా! మాటాడ రేమి? సత్యలోకమున కరుగ రైతిరా?

మృకం:—సతీ! పోయితిని. ఫల మవాచ్య మై చిత్తసంక్షోభకారణ
మైనది.

మరు:—(తనలో) కటాకటా! ఇచ్చట నా కేకారణమున సంతాప
మయ్యెనో, యాకారణమున నే, జీవితేశ్వరున కాసన్నిధానమునఁ
బరాభవము సంభవించి యుండునా? (ప్రకాశముగ) నాథా!
దైవవిధి మనల నిర్వ్వర బాధించుచున్నది. మనపూర్వజన్మకృతదో

షమునఁ గదా! సంతతిలేనివార మైతిమి. ఇంతకుము న్నిర్వురు ము-
నిపత్నులు, మనపర్ణశాల కేతెంచి, మంచినీ రిమ్మని, కుశలప్రశ్నల
చే గ్రహించి, గొడ్డురాలిచేతి పూరిపుడక యేనిఁ గైకొనఁ దగదని,
జలములఁ బరిత్యజించి పోయిరి. నేనాపరాభవమునఁ గుందుచుఁ
దమరాక కెదురుచూచుచుండ నా యభాగ్యదేవత మీకుసైతముఁ
దటస్థ మగుట, దురంతదుఃఖభాజన మై యున్నది. మన కింక గతి
యేది? ఎవరు దిక్కు ?

మృకం:—కట్టా! నేఁటికి మనయాశ్రమ మెంతవిచారగ్రస్త మైనది!
(భగవంతు నుద్దేశించి) ఓ సర్వేశ్వరా! శంకరా! దీనబంధు!
నేను నీదాసానుదాసుఁడ నై, నీవే యేడుఁగడ యని తలంచి, నిశ్చ
యమానసుఁడ నై, భజించు చుంటినే! యీదుస్తరకలుషవారా
శినుండి తప్పించుకొనుమార్గ మెద్ది? నీకన్న మాకు వేరుగతి కలదా?

మ. కరుణాలేశము లేదె? భక్తుఁడను నేఁ గానే? ననున్ బ్రోవగా
భరమంచున్ ద్యజియించితే? జగములన్ బాలింప నీవే కదా?
కరిచర్మాంబర! నాగభూష! హర! గంగాసంగమోల్లాస! మా
దురితంబుల్ దొలగింపవే! యొకసుపుత్రుం గూర్పవే! యీశ్వరా!

మరు:—నాథా! మనల నీయాపదనుండి దరిఁజేర్ప, నేమహానుభావుఁ
డైన దయచేసి, తరణోపాయ మెఱిఁగించిన సంతస మగునే! అది
యు, నరు దయ్యెఁ గద ?

మృకం:—(ఆలించుటనటించి) ప్రాణేశ్వరీ! ఎచ్చటనుండియో, మహ
తీనినాదము వినవచ్చు చున్నది. దేవర్షి యగు, నారదుఁడు త్రిలో
కసంచారి యగుట, వియన్మార్గగామి యై, యెచ్చటికోఁ బోవుచుండ
నోపు.! భాగ్యవశమున నిటు రాఁగూడదా ?

మరు:—అయ్యో! మనకంతటి యదృష్టమా? (అని యిర్వురు బయ
లాలకించుట నటింపు చుండ)

శిష్యు:—(పూజాద్రవ్యములఁ గొనిప్రవేశించి) గురువుల కభివాదము.

మృకం:—దీర్ఘాయురస్తు.

శిష్యు:—(లోపలి కేఁగి, పూలబుట్ట నందుంచి వచ్చును)

నార:—(ప్రవేశము) (భజగోవిందం)

మృకం:—వందే హం సన్మునిపవిత్రచరణం (నమస్కరించును)

మరు:—మహాత్మా! నమస్కారము.

నార:—సుపుత్రప్రాప్తి రస్తు.

మృకం:—దయచేసి, యీకృష్ణాజిన మలంకరింపుఁడు.

నార:—శ్రీమన్నారాయణ! నారాయణ! (అని కూర్చుండును)

మృకం:—(కూర్చుండును)

మరు:—(నిలుచుండును)

మృకం:—దేవర్షిసత్తమా!

చ. అమలచరిత్ర! మీరలు మ దాశ్రమ భూమిని జేరవచ్చుటన్
మముఁ గృతకృత్యులన్ సలుప మానసమందుఁ దలంచి రంచు నెం
తుము భవదీయదర్శనము తోడనె ధన్యతఁ గంటి మయ్య! మా
తనుము లడంగిపోయెఁ వసుధాస్థలి వార్త లెఱుంగఁ దెల్పుఁడీ!

నార:—"వసుధాస్థలిఁ" యన నేల? ముల్లోకంబులఁ గలవార్త లెల్ల నీయుల్లంబు పల్లవింపఁ దెల్లం బొనర్చెద నాలింపుము. సిన్నటిదినమున, విధాతృసదనమ్మున కరిగి, ప్రసంగవశమున విశేష మరసి, పిమ్మట, మృకండునకుఁ గతియేమని, సృష్టికర్తను బ్రశ్నించితి.

మృకం:—మహాత్మా! కమలగర్భుఁ డే మని యాన తిచ్చెను?

నార:—"వారణాశికిఁ జని, గృహిణీసమేతముగ, మణికర్ణికాఘట్టమున, గౌరీ, శంకరులఁ గూర్చి తపం బొనరించినచో, నర్ధనారీశ్వరుఁడుఁ బ్రసన్నుఁ డై, సుపుత్రు నొకని బ్రసాదించు" నని నిరాఘాటముగ వాక్రుచ్చె నంతఁబిత మహాను నాజ్ఞఁ గైకొని, నీకీవార్తఁ దెలియఁ జేయుట కీమార్గమునఁ వచ్చితిని.

మృకం:—ధన్యోస్మి! ధన్యోస్మి! మహాత్మా! తమపరోపకారపారీణ
త నెంతయుఁ గొనియాడెద.

మరు:—సదయాత్మా! మణికర్ణికాఘట్ట మంతటిప్రభావము గలది కాఁ
బోలు! లేకున్న నిమిత్తమాత్రముగ, «వారణాశి» యనియే సెల
వీకుండునా?

నార:—సాధ్వీ! విపులముగవర్ణించిన, నొకగొప్పగ్రంథము కాగలదు.
బ్రహ్మాదులుఁ దత్సరోవరస్నాన మాచరించి, నిశ్చలతపంబుఁ జేసియే
భువనములఁ సృష్టింపఁ బెంప, హరింప సమర్థులైరి. కావున మీ
రింక వేగిరంపడి, కర్తవ్యమున కుపక్రమింతురు గాక

మృకం:—
మరు:— } మహాభాగ్యము.

నార:—నే నింక నాయాశ్రమమున కేఁగెదను, మీరు రేపటియుద
యమ్మునననే పయన మగుఁడు.

మృకం:—చిత్తము! వెండియుఁ దమదర్శన మపేక్షింతు.

నార:—అలాగుననే! మీపుత్రునిజిలిబిలిపలుకు లాలింప విచ్చేయకుందు
నా? (అని వెళ్లుటనటించును) (భజగోవిందం)

మృకం:—
మరు:— } (సాగనంపుట నటింతురు, తెరపడును)





"శ్రీరామచంద్రపరమాత్మనే నమః"

# మార్కండేయ నాటకము.



## ద్వితీయాంకము. 1 వ రంగము.

కాశికాపుర వీధి

(ప్రవేశము భట్టోజీదీక్షితులు)

భట్టో- శ్లో॥ వందే శంభు ముమాపతిం సుర గురుం వందే జగత్కారణం
వందే పన్నగభూషణం త్రిపుర భిత్ ఫాలాగ్ని నేత్రోజ్వలం
వందే భక్త జనావనం శశి ధరం వందే ముకుంద ప్రియం
వందే దేవకిరీటకోటివిలసత్పాదారవిందం శివం.

(ప్రవేశము వేంకటచైనులు)

వేంక:—(స్వ) వృద్ధజంబుకమువలె నీభట్టోజీదీక్షితు లెచ్చటికో వెళ్లుచున్నాఁడు. ఎప్పుడు చూచినా ధనార్జనప్రయత్నమే కాని యితరవ్యాపారములేదు సంతానమా, చట్టుబండలా! ఎవరుతినను! శవవాహక సంపాదనబాపతు రెండులక్షలు, నీటికాసులుతాలూకు లక్షాయేఁబదివేలు, పూడ్చిపెట్టి పొట్టనిండ గూడైనఁ దినక, యీముట్టుమధ్యాహ్నమునఁ గ్రిందఁగాల్లు, మీఁద నెత్తి.కాలుచు నుపాదానమునకై బయలు దేరకున్న, వీని కేమి మునిగినః?

భట్టో:—(కఱ్ఱబొట్టాడుచుకొనుచు సమీపించి) ఎవరు నాయనా? వేంకటావధానులా యేమి?

వేంక:—అవధాని కాదు! చైనులు.

భట్టో:—నీవా! రామసోమయాజుల బిడ్డవా?

వేంక:—ఆ! అగును. అయితే, తాతా! ఇంతయెండలోఁకూడఁదిరగట
మెందుకు. ఆకూడఁబెట్టినది చాలదా? ఇఁక నీవృత్తి మానరాదా?

భట్టో:—అగును కాని అలవాటు వదలితే తోఁచదు బాబు!

వేంక:—తోఁచకుంటే కులాచార మగుతపస్సుఁ జేసికొనరాదా? దానివ
లన, పూర్వపుణ్యముండి, సంతాన ముదయించి సద్గతిఁ జేకూరునే!

భట్టో:—ఓరి! వెఱ్ఱివాఁడా! యింకను సంతానాపేక్షయా? సరిసరి!

వేంక:—నేను వెఱ్ఱివాఁడనుఁ గాను! చూడు మామణికర్ణికాఘట్టమున
మృకండమరుద్వతులను మునిదంపతులు నీకంటె వయోవృద్ధులు,
సంతానాపేక్షచేఁ దపోనిష్ఠాగరిష్ఠులై, యీశ్వరు నారాధించు
చున్నవారు. ఎక్కడనో మునిపల్లెయం దుండువారే యిచ్చటకురాఁ
గా నూరిలోనివాఁడవుఁ వారికన్నఁజిన్నవాఁడవునీ వుపేక్షించుట మం
చిదియా?

భట్టో:—అయితే! వారిసంగతి నీ వేలాగ్రహించితివి?

వేంక:—విశ్వేశ్వరార్చకుని భార్య చెప్పిన దని మాయింటిది నాతోఁ జె
ప్పినది.

భట్టో:—అంతేనా? నీవు చూడలేదుగా!

వేంక:—అవ్వతోఁకూడా! నీ వాయువ్యమమున కుపక్రమించిన నేనే
చూచి వచ్చెదను.

భట్టో:—ఇదుగో నోయి! దీని కేమి! నన్ను «తాతా» అనినను, మా
యింటిదాన్ని, అవ్వనకుసుమా! విన్నదా మాట దక్కదు.

వేంక:—అయ్యబాబో! నీకన్న ముసలిదిలా గగపడునే, అంతకోపమా?
ఆలాగైన, కోపి కోపిక యుండదు! అదిలేకున్నఁ దప మాచరించుట
కష్టము ఆచరించినను, సిద్ధింపదు! రా! రమ్ము! ఇంటికిఁబోవుదము.

భట్టో:—నే నాలావెళ్లి రెండుమూఁడుగడప లెక్కినం గాని చెంబు నిండదు. నీవు పద.

వేంక:—మంచిది (నిష్క్రమించును)

భట్టో:—తప మట, వీడిమొగ మట, సంతాన మట; ఒకవేళఁ గలిగినను నే నింతకష్టపడి యార్జించినది వాఁ డేదురభ్యాసమున నాశనముఁ జేయునో, తద్వారా పితృదేవత లధోలోకముపాలు గావలసివచ్చును. సంతానము లేదువిధము లు గాన నాయవసానకాలమున కున్నధనములో నేఁబదివేలు భార్య కుంచి, మిగిలినది యేభారతీయవిద్యాలయాదుల కైన నిచ్చిపోయెదను. (నిష్క్రమించును)

(ఇదివిష్కంభము)

(తెర యెత్తఁగా, మణికర్ణిక, యీశ్వరధ్యానముఁ జేయుచున్నమృకండమరుద్వతులు నమస్కరింపుచుఁ గనిపింతురు)

మృకం:—శంభో! సకలాభీష్టప్రదా! గౌరీరమణా! పాపహరణ!

మ. కరుణాలంకృతమానసాంబురహా! శ్రీకంఠా! సదానంద! దు
స్తర దుర్వారభవాంబురాశితరణా! సద్యోగ సంపత్కరా!
గిరిజేశా! త్రిపురాసురాంతక! మహాగ్నిజ్వాలికానేత్ర! నీ
శర ణంటిన్ నిజ భక్త పోష! సకలైశ్వర్యాకరా! శంకరా!

(గౌరీశంకరులుఁ బ్రసన్న మగుదురు)

శంక:—ఓపుణ్యదంపతులారా! మీనిశ్చలతపంబున కానందభరితుల మైతిమి! మీ రర్థించినపుత్రుఁడు దీర్ఘాయుర్దాయువుగలదుర్గుణుఁడు గావలెనా? అల్పాయుష్కుఁ డగుసుగుణుఁడు గావలెనా? కోరికొనుఁడు.

మృకం:—దేవాదిదేవా! సకలలోకశరణ్యా!

మ. చిరకాలంబుననుండి సంతతికి నై చింతించి చింతించి త్వ
చ్చరణాబ్జంబుల పూజ సల్పి ఖలు నే చందంబునన్ గోరుదున్
దురితున్ గాంచె మృకండుఁ డంచు జనముల్ దూషింప నెట్లోర్చెదన్
మొరకుంబుత్రుఁడు వంశవృక్షమును నిర్మూలంబు గావింపఁడే?

శంక:—అటు లేని, మహోన్నతగుణగణాలంకారుండును పదియార్వత్స రముల కతిక్రమించని వయఃపరిమాణుండును నగు వాని నొసంగితి.

మరు:—(ఖేదామోదములతో) కట్టా! మాయానందకాల మెంతస్వల్ప ము? అయిన నీజగజ్జనని నిట్లు వేడుకొనియెద. (ప్రి)ఓతల్లీ? దీనజన కల్పవల్లి?

గీ. గొడ్డురా లనుమాట కేఁ గుందికుంది!
ప్రాణములువోక జీవచ్ఛవంబ నగుచుఁ
గడకు నీదయఁ బుత్రినిఁ గాంచినజల
నతని,యల్పాయువుగ కయి, యడలఁ గలనె!

గౌరి:—సాధ్వీ! నారు వోసినభగవానుఁడు నీరు వోయకుండునా? ఇప్ప టి కొంం డెద్దియుఁ గోరకుము.

మరు:—మహాప్రసాదము (మృకండమరుద్వతులు శిరములు వంచి నమ స్కరింతురు.) తెర వాలును)

(అరణ్యమార్గము) (ప్రవేశము నారదుఁడు)

నార:—(భజగోవిందం) ఔరా! పరమేశ్వరునిమాయ దెలియుట దుస్సా ధ్యముగద! ఎంతకాల మెవ్వరి నేమనోవ్యాకులతచేఁ గృశింపఁ జేయు నో! ఎవ్వరి నేవిధమున సంతోషసాగరమ్మున నోల లాడించునో, తెలియనీక, రాత్రింబవళ్లవోలె నాయాకష్ట సుఖములను, హతాత్సం భవములుగ, సమకూర్చుచుండును. అటులే కాకున్న, మొన్నమొ న్నటివఱకు, సంతానహీనతచేఁ బరితపించినమృకండమరుద్వతులకు, పుత్రప్రాప్తియగునని యెవ్వ రేనిఁ దలఁచిరా? ఇది దైవయోగ ముగాక యితరమగునా? కాని, పాప మాతనయునకు షోడశవత్సర ము లే జీవితకాల మగుటకు విచారింపవలసె నిట్టిపాటునకుఁ బూర్వ జన్మకర్మము కారణముగాఁ నుండవలయు లేదా యేతత్పరిమాణ మునకు గోప్య మగుభావ మే దేని యుండ నగు నంతియె కాని,

తనభక్తులును, వృద్ధులును, జిరకాలమునకు సంతానోదయమున నానందించువారును, నగుమునిదంపతులను, వెండియు దుఃఖింపఁజేయుటకు, గౌరీవరుం డంత నిర్దయుఁడా? కాఁడు! కావున నేనీవిషయమున నిశ్చయము తెలువఱకు, నోపినకొలంది శ్రద్ధతో విచారించి, నారదుఁడు, కలహాభోజనుఁడే గాక, భూతదయాపరుఁ డనికూడఁ గీర్తివహింపవలయు. లిఖిత ముండె నేని, యీసందర్భమునఁ గడుపునిండ భోజనముగూడ సమకూడును. నేటి కింక నాయాశ్రమమున కేఁగి, కర్తవ్య మాలోచించెద. శ్రీమన్నారాయణచరణారవిందధ్యానానందమానమానసుఁ డగు నీదేవర్షివాంఛితములు నెరవేర కుండునా? కానిమ్ము. (భజగోవిందం)

(మృకండునిపర్ణశాల, మరుద్వతీమార్కండేయు, శిష్యులతోఁ గూర్చుండి యుండఁ దెరయెత్తఁబడును)

మృకం:—మరుద్వతీ! ఋషిసాంప్రదాయవిరుద్ధ మగు, ప్రేమానుబంధమునుబట్టి, నేను నైతము విడచి యుండఁజాలను; కాని, ‟గురుశుశ్రూషయా విద్యా”యను నట్లు గొంతకాల మైన గురుకులవాసు నొనర్చినం గాని యుత్తమము గాదు. న యొద్దనే చదివింతమన, లేకలేక జన్మించినతనయుఁ డగుట, భయభక్తులతోఁ జదివించుటకు, మోహము నడభ్యంతరము పెట్టును. భయరహితులకు నిర్దుష్ట మగువిద్యాగంధ మలవడదు. అందుచే, నామిత్రుఁడును, సర్వశాస్త్రపారంగతుఁడును, నగు, కణ్వమహర్షికడఁ జదివించుట సమంజసము. తదాశ్రమ మిచ్చటి కనతిదూర మే యగుటవలన మన మప్పు డప్పుడు చని, చూచి వచ్చుటకును, అనధ్యయనదినములలోఁ గుమారుఁడు వచ్చి పోవుటకును, వీలుగ నుండును. ఇఁక సంకోచింపకుము.

మరు:—చిత్తము. నేను రెఱుంగని యంశముఁగలదా?

(ప్రవేశము కణ్వుఁడు)

మృకం:—ఓహో! ఏమి నాభాగ్యము. నామస్మరణమాత్రమున దర్శనమలవడుట కెంతయు సంతసించెద. (చేతఁజూపి) ఈవ్యాఘ్రాజినముపై విశ్రమింపుము.

కణ్వు:—(కూరుచుండి) మిత్రమా! మృకండా! పరమేశ్వరసాక్షాత్కారధన్యతముఁడవు, నినుఁ గనవచ్చుట యబ్బురమా? (మార్కండేయుని జూపుచు) ఇతఁ డేనా? శంకరవరప్రసాది!

మృకం:—(కుమారునితో) బాబూ! తాతగారికి నమస్కరింపుము.

మార్కం:—(కణ్వుని డాసినమస్కరించును) (అనుబంధము 12)

కణ్వు:—శుభం భవతు! శుభం భవతు (అని దగ్గఱకుఁ దీసికొని) నాయనా! ఈశ్వరదత్తుఁడ వగుటనీయాశ్లేషణ మమందానందదాయకమై వెలయుచున్నయది (మృకండునితో) వయస్యా! నారదునివలన సర్వ మెఱింగితి, భగవానుఁ డిం కే మాజ్ఞ నొసంగెను?

మృకం:—ఆజ్ఞలమాట యటుండఁగ ఆహా! యేమాపరమేశ్వరునిదయార్ద్రస్వాంతము! యే మాభక్తవత్సలత! సాక్షాత్కారసమయనిరుపమానంద మిప్పటికినిఁ బులకాంకురితశరీరుఁ గావించుచున్నది వినుము.

సీ: మగ్ధపాథోధిముద్దుల పట్టి రాకా శశి
ఘనజటాజూటాట విని వెలుంగ
విమలీకృతాఘౌఘ విష్ణుపాదోద్భవి
జాహ్నవీదేవి శీర్షమునఁ గులుక
సకలలోకాలోక సంస్తూయమాన రు
ద్రాక్షలు భూతి దేహమున మెరయ
నగణిత గుణరాశి జగదంబ శాంకరి
ప్రీతితో వామాంక పీఠి నుండ!

గీ: ప్రథిత గజచర్మవసనధారణముతోడ
డంబుమీరు త్రిశూలహస్తంబుతోడ

భక్తసంత్రాణశీలత త్వరతతోడ
హరుని కనులారఁ గంటిమి యార్తిఁ దీర.

ఋత్రుఁడా నీవాక్యములచే నా కిప్పుడు సాక్షాత్కరించిన ట్లు
భవదానందమునకు మేర యున్నదా? పులకాంకురమాత్రి
ము. చైతన్యముం గూడఁ దొలంగించును. ఇక్లెంత కాలమువ
ు దనివి తీరదు. న న్నెందులకు దలపెట్టితివి?
శిష్ట్రశిక్షణఫల మగు నీచిఱుతని నీయొద్ద విద్యాభ్యాసునిఁ
నెంచితి; నందు కై.

ంచిది! ఇది కడుయోగ్య మగుసమయము! నా వెంటఁ గొం
ఁ బంపుము.

కుమారునిదగ్గఱకుఁ దీసికొని) తండ్రీ! "విద్యావిహీనఃపశుః"..
ద్దలు వచింతురు కాన కొంతకాల మీగురువులకడఁ జదువు
దవా?

-జనకా!

జగతి జన్మించి మానవ జాతియందు
మౌఢ్యమున మని యుంట, స మంజసంబె?
కాన నీదేశికుని సన్ని ధానమందుఁ
జదివి వచ్చెదనయ్య! ని స్సంశయముగ.

కఱకుఁ దీసికొని) నాయనా! మే మప్పు డప్పుడు వచ్చి చూ
ము. గురువులయాజ్ఞ యైనప్పుడు సహవాసునితో నీవు
దవుగాక పోయిరమ్ము.

-తండ్రీ! నమస్కారము. తల్లీ! నమస్కారము. నన్ను దీవిం
ఁడు.

} సకలవిద్యాప్రాప్తింగతో భవ.

పోయి నాయనా! (మృకండమరుద్వతులతో) ఇఁక మీ
మే మేఁగి వత్తుము-- (తెరపడును)

(ప్రవేశము. ఋషికుమారు లిర్వురు)

(1 మైత్రేయుఁడు. 2 శారద్వతుఁడు)

శార:—మైత్రేయా! మార్కండేయుఁడు, శంకరవరసంభవు డగుటఁగాఁ బోలు నక్షరాభ్యాసమైనది తడవుగఁ శాస్త్రచర్చలందు నెవ్వరికి నంద కున్నవాఁడు. దైవకటాక్ష మెంతకైనఁ జాలిన దేసుమా!

మైత్రే:—సందేహమా! కాని, యాతనిమనోనిరూఢతఁ గనుగొనవలయు నని నా కించుక యూహ జనించు చున్నది. అందుచే నేటికుశాసంగ్రహణసమయమున నేను, విష్ణువే మహోత్కృష్టుఁడనియు శివుఁడు సామాన్యుఁ డనియుఁ నిమిత్తమాత్రముగ నుపన్యసించి, అందుపై హృదయముఁ గనుగొనియెద.

శార:—అతఁడు, జ్ఞానసంపన్నుఁడు. అందుచే, శివకేశవులకు భేదముఁ గల దనుట కంగీకరింపఁ డని తోఁచెడిని.

మైత్రే:—అట్టి యభేదసాంప్రదాయము, మనము సైతము మెఱుంగమా? అయినను, మార్కండేయుని యభిమతముఁ గూడ, నతనినోట వినుట కెట్లుండునో యని.

శార:—ఇంతకంటె, నీశ్వరతత్వమును గురించి యుపన్యసింపు మని కోరుట సమంజస మేమో ?

మైత్రే:—ఒకనిమనోవ్యక్తిఁ బయల్పరచుటకు, యుక్తిప్రయోగ మే ముఖ్యముగద ?

శార:—సరి యే కానిమ్ము. పూజాద్రవ్యములఁ గొని రాఁదగిన సమయ మగు చున్నది పోవుదము. (నిష్క్రమింతురు)

(విపినవాటిక; ప్రవేశము; మార్కండేయుఁడు, శారద్వతుఁడు, మైత్రేయుఁడు, గాలవుఁడు.)

(అనుబంధము-1 చే)

మైత్రే:—ఆహా! ఆవటపత్రము లెంతయానంద మొసఁగుచున్నవి, కావుననే, శ్రీమహావిష్ణు వీ యాకుపైఁ బరుండి సప్తమహర్షులచేఁ

గొనియాడఁబడియె. శివుఁడు శివుఁ డనుట యే గాని, ప్రేతభూ
ములం దక్క, నిట్టిమనోహరతలమున నెన్నఁ డేని నివసించెనా?
ల:—రమారమణుపైఁగలప్రేమ, నుమారమణుదూర నగునా?
త్రి:—తూలనాడు టే మున్నది? బుడబుక్కలవేషము, సతీవిసర్జ
నము, పులికలాపము, పునుకమాల, భిక్షుకత్వము. శిరస్తటగంగా
ప్రశంస మున్నగున వెవ్వ రెఱుంగరు? యథార్థముఁబలుకుట త
ప్పగునా?
మార్కం:—(ఆనందమున నవ్వుచుండును)
ల:—మార్కండేయా! వింటివా? శివతిరస్కారము. దీనికి నీ వే
మందువు?
మార్కం:—ఏమందును! అమితానందము నొందుదును. ఏల నన దూ
షణచేఁ గాని, భూషణచేఁ గాని, భగవన్నామోచ్చారణ మొన
రింపుట యే గద! ముఖ్యము. అందు, శివ, కేశవుల నిర్వారనోకేకా
లమునఁ దలంచుటచే, మఱియు సంతోషము. ఒకవేళ నీవనినట్లు
నిక్క మగుదూషణ యే యనుకొనుటకు, లోకపావనుం డగుశంక
రునిపవిత్రతరము లగుచర్యల నే వక్కాణించె గాన నట్టి యవకా
శ మణుమాత్రమును లేదు. రక్షకుఁ డగుశంకరుఁడు, గజచర్మ వస
నధారుఁడై, భృంగీశ్వరాదులఁ బురస్కరించుకొని కైలాసాచలో
న్నతప్రదేశమునఁ దాండవకేళి యొనర్చినప్పుడు, తన్మహేశ్వరకరా
లంకృతం బగు, బుడబుక్కలడక్కివంటి, ఢమలకమునుండి జనించిన
శబ్దములం బట్టియే, పాణినీయుఁడు మొద లగుధీవిశాలురు, శబ్ద
శాస్త్రముల రచించి, భాషాప్రపంచమునకు మే లొనరించిరి. కావు
న, బుడబుక్కలవేష మొక్కటియే జగంబుల కింతటిమహోపకార
మొనర్ప, నిఁకఁ దక్కుంగలశివలీల లెంతజగదుద్ధారణకారణంబు ల
గునో యూహింపుము! ఇయ్యది కౌముద్యాదిగ్రంథపఠనప్రారంభ
మునమనము చదివినదే కద! ఇది యిట్లుండ "శివాయ విష్ణురూ

ప్రాయ, శివరూపాయ విష్ణవే" యని వేదములుద్ఘోషించుచుండ నదిగు ర్తెఱుంగక భిన్నాభిప్రాయులై గొందఱు చెడిపోవు చుండిరి. కాని, మన మామార్గ మవలంబించక పెడత్రోవలం జను వారల నీమార్గ మునం బ్రవేశింపం జేసి, సంఘీభావమున మెలంగుట పరమోత్త మము. అట్టియైక్యస్థానమే ప్రణవము. అది యే సర్వశక్తిస్వరూ పపరబ్రహ్మ మని పేర్కొనంబడు చున్నయది. సంఘీభావశూన్యుని చిత్తము, నిర్మలినముగా నుండం జాలదు. కల్మషహృదయమే పాపకార్యాచరణములకు మూలకందము. అట్టివానిని భగవంతుండు విశ్వసింపండు. "ఐకమత్య" మనుమహాయుధము ధరింపకున్న, భగవ త్కార్యములు గాని, దేశవిషయములుగాని, వంశమర్యాదలు గా ని, చివరకు బహుస్వల్పముగుస్వవిషయముం గాని, నెగ్గించుకొను ట కష్టము. గావున, నీతని నే నేమియు, ననుటకుసమర్థుడం గాను. ఒరులుం బ్రేరేపించిన నొడంబడను! అట్టియగత్యమును, లేదు! నీ యందు, నాయందు నితనియందు సకలభూతములందు, సంపూర్ణ ముగ నిండి యుండి ప్రకాశించువాం డొక్కండే యనుట నిశ్చయ ము. నిర్ధారణము. నిస్సందేహము. ఇది యంతయు నెఱింగి యున్న ను, నాహృదయముం గనుంగొనుట కీమిత్రుం డర్హుండెం గాని, యితరము గాదు. (మైత్రేయునిబుజమునం జేయివైచి) చెలికాండా! నీమూలమునంగద, సత్కాలక్షేపము జరిగినది. ఎంతయుసంతోషము.

మైత్రే:—(స్వ) ఆహా! ఇతం డెంతసాత్వికస్వభావుండు శాంతవర్తనమే, ధూర్తకులవిభంజనము ప్రజ్ఞానసంపన్నుండ వగుమార్కండేయా! నీమిత్రతకు నీనిష్కళంకహృదయమునకుం గడుంగడు సంతసించితి. నీవుదలంచినట్లు నిన్నుం గనుంగొనుట కే నర్హుండెం గాని, యితరము గాదు. మన్నింపుము.

మార్కం:—మిత్రుండా! మన్నించుటకు, నీయొనర్చినతప్పేమి? ఇంక

మన మందఱి మొకమా రాయీశ్వరు ధ్యానించి పిమ్మట కుశ, సమిధ, పుష్ప, పత్రాదులగ్రహించి, గుర్వాశ్రమమున కేఁగుదము.

అందఱు:—అటుల నే గావింతము.

(అనుబంధము-14) (పుష్పములఁ గోయుటకై నిష్క్రమింతురు.)





"శ్రీరామచంద్రపరమాత్మనే నమః"

# మార్కండేయ నాటకము.

## తృతీయాంకము.

(మృకండాశ్రమము)

(మృకండమరుద్వతులుఁ గూర్చుని యుందురు)

మరు:— ప్రాణేశ్వరా! సుతుఁ డింకను రాఁ డయ్యెనే? నేఁ డనధ్యయనము గద?

మృకం:— వచ్చుచుండె నని యూహింతు.

మరు:— దేవా! కుమారు నింక మన యాశ్రమమున నే యుంచి విద్య నేర్పుదురా?

మృకం:— అటులే వర్తమాన మంపితిఁ గద!

మార్కం:—
శార:— } (ప్రవేశించి) జననీజనకులారా! వందనములు
దేవా! నమస్కారము.

మృకం:—
మరు:— } నాయనా! రమ్మని (అని కుమారుని దగ్గఱకుఁ దీసికొందురు)

మృకం:— (శారద్వతునితో) అబ్బాయీ! కూర్చుండుము. శాశ్వతబ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁ డగు, మీయాచార్యుఁడు, శిష్యులు లో నగువారు, సుఖముగా నుండిరా?

శార:— అయ్యా! అందఱు కుశలముగ నుండిరి. మీతనయు దిగవిడచి,

క్షేమవార్తఁ గొనిరమ్మని సెలవిచ్చిరి. నా కాజ్ఞ నొసంగుఁడు.

మృకం:—సంతోషము. సర్వదా కృతజ్ఞుఁడ నని మనవిఁ జేయుము.

మరు:—నాయనా! యాశ్రమవాసినులకు విధేయురాలనని విన్నవింపుము.

శార:—చిత్తము. (నిష్క్రమించును)

మృకం:—(కుమారునితో) బిడ్డా! కులదీపకా!

చ. విదిత యశుండు కణ్వముని విద్య లొసంగెనె? గారవంబునన్
జదివి తివే? గురూత్తముని సన్నిధి భక్తి సమస్తవిద్య లిం
పొదవఁగ వాని నెల్ల విన నుంటిమి నేనునుఁ దల్లి కాన స
మ్మదమునఁ బల్కుమయ్య మనముల్ వికసింపఁ గుమార రత్నమా.

మార్కం:—తల్లిదండ్రులారా సకలశాస్త్రములఁ జదివితి విద్యకు విన
యమే భూషణమని గ్రహించితి. (అనుబంధము--15)

మరు:—తనయా! సహజాలంకార మగు,నీనమ్రత యే, నిన్ను విద్యా
వంతు నొనరించె. కన్నందుకు మాకును, విద్యోపదేశ మొనరించినం
దులకు గురులకును, సంతోషముఁ గూర్చితివి. ఐహికాముష్మికసు
ఖావలంబనమునకు, విద్యయే కారణభూతము గద.

మార్కం:—తల్లీ! పడరానిపాట్లన్నియుఁ బడి, నన్నుఁ గనుటచే నె
క్కుడు ప్రేమ ముండుటయు, దానివలన నన్నుఁ జూచి కాని నాప
ల్కు లాలించి కాని మీ రానందించుట సహజమే. ఎంతటి యప్ర
యోజకుఁడైనను తమబిడ్డ తమకు మంచివాఁడుగనే తోచుట లో
కసామాన్యము గద!

మృకం:—కుమారా! అట్లనకుము! శంకరవరప్రసాది వగుట నీ కేకొ
ఱంతయు లేదు.

మార్కం:—జనకా! కొఱఁతలే కేమి? సకలలోకశరణ్యుఁ డగు నీశ్వరు
నారాధించితినా? అదిగొప్పలోపముగా కుండునా? మానవుఁడై
జనించినందుకు, జననీజనకుల సంతోషపెట్టవలయు; వంశమర్యాదలఁ

గా పాడవలయు; సకలభూతసమదృష్టిని జరింప వలయు; విద్యాభివృ ద్ధికై పాటుపడ వలయు; జ్ఞానాభివృద్ధికై, పెద్దలపాదసేవఁ జేయవ లయు; ధర్మోద్ధరణమునకై, స్వశరీర, ప్రాణాపేక్షల నైతముద్యాజి యింప వలయు; నిష్ఠాగరిష్ఠుఁడై సర్వేశ్వరుఁ బ్రసన్నుఁ జేసికొని, జ న్మరాహిత్యపదవి నందవలయు. అట్టివాఁడే మానవుఁడు; వానికే యంతటఁగొనియాడఁబడుయశస్సు చేకూరును. ఒకవేళ నిందేయం శమునఁ బ్రవేశింప కున్నను, మూఢభక్తిచే నైన భగవత్సేవ నొ నరింప వలయు (అనుబంధము--16)

కావున నేనీశ్వరసేవకై కాలనిరీక్షణ మొనరించు చుంటి. సెల వొ సంగినఁ బరమానందభరితుఁడ నగుదు.

మరు:—పట్టీ! మాకప్పుడే నీవియోగము ఘటింతువా?

మ. జననం బందితి మొన్న మొన్న నె గదా? సంతోష మేపార వి
ద్యను నేర్పింపగఁ బంపఁగాఁ బడితి వంతఁ బంచమా బ్దంబునన్
దనయా! యీశ్వరుఁ గొల్వ లేఁగనుచుఁ జింతన్ బొందె దేమంటుఁద
ల్లిని కన్నందుకుఁగొన్నినా ళ్లయినఁ బాలిన్ జూచికోఁ జెల్ల దే?
తండ్రీ! నీ వన్నమాటనేనిఁ జెల్లించుకొన వలదా?

మార్కం:—అమ్మా! నే నే మంటిని?

మరు:—“తల్లిదండ్రుల సంతోష పెట్టవలయు” నని పలికితివి కద?

మార్కం:—సత్యమే! అయినను, శునకమువలెఁ జంచలవర్తనముగలచి త్తమునకు బుద్ధిఁ జెప్పి, యీశ్వరసేవా పరతంత్రుఁడై తదేకధ్యా నసంపన్నుఁడై, పరమానందమున మునింగి, తేలుచున్న తనయు నీ క్షించుట, మీసంతోషమునకుఁ గారణ మగుఁ గాని, నాలు గక్షర ములు పట్టుపడుటయే కాఁజాలదు. కానఁనన్నుఁ జూచి ప్రస్తుతము సంతోషింపనగునా?

మృకం:—తనయా! నీవాంఛిత మత్యంతసమాదరణీయ మైనను, మా మురిపెముఁ జెల్లించుట కేని మఱికొంతకాల మోపిక నేయుము!

మార్కం:—జనకా! నేను దనయుఁడనై యుండఁ నీయాజ్ఞకు వ్యతిరేక
ముండునా! (అని తల్లినిజూచి) అమ్మా! (ఆశ్చర్యముతో స్వగతము) ఇదే
మి! నాతల్లి దుఃఖించుటకుఁ గారణ మేమి? (తల్లితో) మాతా! ఏలవి
చారపడియెదవు? మీ యాజ్ఞలేక నేఁ బోఁగలనా? పోయిన, నాత
పము సిద్ధించునా? మీరు మనఃపూర్తిగఁ బొమ్మనినపుడే పోయె
దను చింతింపకుము (తనలో అనుబంధము-17.)

నావాక్యమే, యీమెవిచారమునకుఁ గారణము ఆహా నేనెంతదుర్మా
ర్గుఁడను! తల్లికి సంతాపముఁ గలిగించి, పాప మొడిఁ గట్టితిఁ గద
తల్లియన సామాన్యమా? ఆమెహృదయమునకు ఖేద మొదవించు
టకంటెఁ ఘోర ముండునా? నిజము నాలోచించినచోఁ దల్లికన్నఁ
జుట్టము, గురువు, దైవముం గలఁడా? మఱియు

చ. పరము నిహమ్ముఁ గూర్చుభవ బంధములన్ దొలఁగంగఁ జేయుదు
స్తరదురితప్రచారములఁ సంహరణం బొనరించు మీఁద ధీ
వసు వొనరించు సంతస మపారముఁగా నిడు మాతృభక్తిత
త్పరుఁ డగువాని కీశ్వరుఁడు, ధన్యుఁడు తల్లినిఁ గొల్చుపుత్రుఁడే.

కావున, సకలకల్మషములుఁ బటాపంచ లగుటకు, పతివ్రతాశిరోమ
ణి యగునాతల్లిఁ బాదము లంటి నమస్కరించెద (తల్లికాళ్లపై బడి)
అమ్మా! మన్నింపుము.

మరు:—నాయనా! ఈదుఃఖమునకు నాపురాకృతదోష మే కారణము,
గాని, నీవు కావు.

మృకం:—(విచారము నటించును)

మార్కం:—తల్లీ! నీపురాకృతదోషఫలము, నేనె యగుదునా?

మృకం:—సుతా! నీయం దిసుమంతయు దోసము లేదు.

మార్కం:—(చూచి) అయ్యో! జననీజనకు లిద్దఱు విచారగ్రస్తు లయి
రే. దీని కేదియో మహాకారణ ముండును అడిగెదఁ గాక

(ప్రి) అమ్మా! నాయనా! మీసంతాపమున కేమికారణము? ఏల
వచింపరు, నామనంబు తత్తరపడుచున్నయది. వేగ సెలవిండు.

మను:—నాయనా! ఏ మని వచింపఁ గలను! కుత్తుకబంటి యగు దుః
ఖమున మాట రాక, తలదినంతనె, గుండెలవియుచున్నవి! నాయీ
దురదృష్టజన్మమున కిఁ కెంతగడువు కలదో తోఁచదు. (అని
దుఃఖించును.)

మార్కం:—అయ్యో! నే నెట్లుసహింతు? తండ్రీ! జ్ఞానమూర్తి వగునీ
వు ఇు విచారపడుచుంటివే? ఏటి కీమనస్తాపము?

మృకం:—నాయనా! సంతానములేమికై, పెక్కువత్సరములు చింతిం
చి, గౌరీశంకరులఁ గూర్చి తపం బాచరించి, నినుఁ గంటిమి.

మార్కం:—సరియే! విచారమేల?

మృకం:—పరమేశ్వరుఁడు నిన్నుఁ బ్రసాదించుటకు మున్న వయఃపరి
మాణ, గుణసౌశీల్యాదుల నిర్ణయించుభారము మాపై నుంచ, నా
యభాగ్యవశమున సకృతాత్మ్నే దయసేయుఁ డని యర్థించితి.

మార్కం:—ఓహో! అట్లైన, నీకుఁ బై సంగతిఁ దాము వచింపఁజా
లరు సరికదా! నేను వినవలసిన యగత్యమును లేదు. “పాపీ చిరా
యు స్స్మృతీ గతాయుః” అనునట్లు, నే నల్పాయుష్కుఁడ నైతి
ననియా మీసంతాపము? ఇందులకై, మీవంటివారు దుఃఖించుట
చనునా? ఏకులంబునఁ జన్మించినను, ఎంత మహదైశ్వర్యసంపన్నులై
నను, బుట్టినవాఁ రెన్నటికేని గిట్టుట సర్వసామాన్యముఁగద! కా
వున, జింతించుట కవకాశ మేముండు నో సెలవిండు? సకలము దై
వాధీనము! మనవలన నే మగు? (మఱియు,

ఉ. ఇంతకుముందు జన్మముల నెన్ని గ్రహించి నశించి యేరికిన్
గాంతుఁడ నైతినో! సుతుఁడు గాఁ జరియించితి నో!! వచింప ర
వ్వంతయు శక్య మౌనె? యెవఁ రైనను మృత్యువుగెల్వనేర్తు రే?
చింతిల నేల? మీ కొమరు జీవితకాలముకై భవా దృశుల్.)

మరు:—హా! తనయా! సుగుణనిలయా! నీ వెంతఁగఁ బల్కినను దుఃఖ
దవానలమున కే నెట్లు తాళుదు? ఏకపుత్త్రవిషయమున నూరట
జనించు నెట్లు!

మార్కం:—అమ్మా! ఇంత కెక్కుడుఁగ విలపించి నైన నా కాయు
ర్దాయముఁ దేఁగలవా?

మృకం:—తండ్రీ! కర్మగతి యిట్లుండ, నంతటిభాగ్య మెట్లు గలుగును.

మార్కం:—కట్టా! దైవమా! గౌరీమనోహరా! దీనబంధు!

(సీ. ఆయు వల్పం బౌట హా యెట్లు సైతురా?
తనయుఁడా యని తల్లి తల్లడిల్ల
మగవాఁ డగుటచేత మనమున నే స్రుక్కి,
జనకుఁ డీరీతి బాష్పములు విడువ
నిదుఃఖవారాశి నీదుచుం డెడివీరిఁ
గనుచున్న నచటి మృగంబులేడ్వ
దిక్కులే కార్తిచేఁ బొక్కుచుండెడివీరి
నూరడింపఁగఁ దగు వారు లేక

గీ. అక్కటా! నేటి కీమృకండా శ్రమంబు
సంతసముఁ దక్కి ఘోరమౌ రంత దుఃఖ
భాజనం బయి, గతిఁ జూపువారు లేక,
నీరసం బయిపోయెనే నిర్మలాత్మ!)

ఆహా! పుత్త్రమరణదుఃఖముకన్న „గొడ్డువా” రనుచింత యే యుక్త
మమైనది. ఇంతటిసంతాపమున మునింగినతల్లిదండ్రులఁ గాంచి, ఇ
తికర్తవ్యతామూఢుఁడ నైయుండవలసె. (కటకటా అగాధ మై
దుస్సహ మై, దుష్కర మై, సతతహృదయశల్యప్రాయమైన, కు
మారమరణశోకము నివారింప మార్గమెయ్యదియు లేదు. వృద్ధులై
చిరకాలమున కొక్కబిడ్డనిం గని, తుద కాతని నచిరకాలమున నే
కోలుపోవుటచే ముకుళీభూతము లైన, జననీజనకహృదయాంబుజము

లు. వెండియు వికసించుట దుర్లభము.) ఛీ! ఛీ! నే నేలజన్మించితిని,
(భగవంతు నుద్దేశించి) ఓరజితగిరినివేశా! యీశా!
కం. ఎందుకు నను బుట్టించితి?
వెందుల కల్పాయు వొసఁగి ♦ యీగతి వీరిన్
గుందించు చుంటి? వూరట
నొందరు నే నేమిసేతు ♦ నో జగదీశా!
ఆహా! దుర్భరము! దుర్భరము! (అని వినుట నటించి) ఆహా: విపం
చీనినాదము కర్ణపేయమై యలర నారదమహాముని దయచేయు
చున్నట్లున్నదే (తల్లిదండ్రులతో) జననీజనకులారా! హరినామా
మృతపానజీవనుం డగు దేవర్షి వచ్చుచున్నవాఁ డూరడిల్లుఁడు.
మృకం } (కన్నుల నీరు దుడిచికొని సంతోషమును చూపించు
మరు } చుందురు)
మృకం:—మరుద్వతీ! మహోపకారి యగు నితఁ డిప్పట్టున నేదో యొ
కమార్గము నుపదేశించునని యూహించెద!
మరు:—అయినఁ గృతార్థుల మే కద! దేవా!
(ప్రవేశము నారద, విశ్వామిత్రవసిష్ఠులు)
ఋషు:— జయ: సకలలోకగురో!
మృకం } (లేచి నిలచుందురు)
మరు }
మృకం:—ఓహో! ఏమినాభాగ్యము! త్రిమూర్తులో యనుచందమున
విశ్వామిత్ర,వసిష్ఠ, నారదులు దయచేసిరే? ధన్యోస్మి! ధన్యోస్మి!
మార్కం:—పరమతపోధనులారా!
గీ. స్వార్థవిషయేచ్ఛ లుడిఁగి, ని ♦ శ్చలతపః ప్ర
భావులై లోకహితముఁ గూ ♦ ర్పం దలంచి,
యనిశ మీశ్వరుఁ గొల్చుమ ♦ హాత్ములార!
త్వత్పదాంబుజముల కిదే ♦ వందనంబు:

విశ్వా } దీర్ఘాయురస్తు
వసి }

నార:—(నవ్వును)

విశా:—ఏమి? నారదా! మే మీకుమారుఁ దీవించినంతనె నవ్వ సాగితివి

నార:—ఏమియులేదు. సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేయఁగలసమర్థుఁడవు నీవును, సకలజగద్గురుం డని విఖ్యాతి వడసినవసిష్ఠుఁడును పొరపాటునకు బాల్పడితిరే యని, నవ్వు వచ్చినది.

వసి:—అ దెట్టిది?

నార:—శంకరుఁ డీకుమారుఁ బ్రసాదించినపుడు "పదియాఱువత్సరము లాయుఃప్రమాణ" మని యానతిచ్చె నట. మీ రాతనియాజ్ఞకు వ్యతిరేకముగ, 'చిరాయుర' స్తని దీవించుట పరిహాసాస్పదము గాకుండునా? భగవంతునివాక్యమున కడ్డుండునా? మునులు తెలివిలేని వారని లోకము లూరకె గేలి యొనర్చునా? ఈలాటి యవ్యక్తములే కారణము.

విశ్వా:—ఔరా! నారదా! అవ్యక్తమా? తెలివిమాలినతనమా? పరిహాసాస్పదమా? అపరబ్రహ్మనైననేను దీవించుటయు, నయ్యది వృథ యగుటయునా? అట్లే యైన నవగ్రహపథంబులకు మార్పుకలిగి, తార లల్లాడి, కులపర్వతంబు లొక్కుమ్మడిం గూలి, శేషునిఫణము లదరి, జలనిధులు మేరమీఱి, ప్రచండమార్తాండుఁడు దనసహస్రకిరణములఁ బ్రసరింపఁ జేయుమట్టమధ్యాహ్నమున నిర్దుష్టముగ నక్షత్రము లెల్లరకుఁ గోచర మై భువనము లల్లకల్లోల మై నూతనసృష్టి సంపద లేర్పడ కుండునా?

నార:—(స్వ) ఈతని కింకఁ గొంచెము పురివెట్టెద(ప్ర)విశ్వామిత్ర! నీవు సమర్థుఁడ వే యైనను,బ్రహ్మవ్రాత కడ్డుండునా? ఆశీర్వచనము లన్నియునెఱవేఱునా? ఈశ్వరుఁడు యోజనలేనివాఁడా? కావునఁ దొందరపడకుము.

విశ్వా:—ఔరా! నారదా! నీకలహభోజనచమత్కారవాక్సంధానము నాకడఁ జూపకుము నాదీవన లితరదీవనలవంటివి కావు. శంకరుఁడు యోజించువాఁడె యైన భస్మాసురాదులచే భంగ మొందునా? సంతానములేనివారి నట్టె యుంచక, యీకుమారు నేల నొసంగవ లయు? పోనిమ్ము. అల్పాయుర్దాయ మేలఘటింపవలయు? ఎవ్వఁడే ని క్షుద్బాధచే మలమలమాడుచు, యాశ్రమమున కరుదెంచి "భిక్షాం దేహి" యని నిన్నర్థించిన విషఫలాహార మొసంగఁ గలవా? అదిధర్మమా?

నార:—ఇది యంతయుఁ గర్మసూత్రము.

విశ్వా:—కర్మసూత్రమో, అధర్మసూత్రమో, చూచెదవుఁ గాక.

వసి:—మీవాగ్వాదములఁ జాలించి, ఋషు లమోఘవచస్కు లనుట సార్థకపరచుఁడు.

విశ్వా:—ఏల వ్యర్థ మగును? మృకండా! వినుము.

ఉ. వారినిధుల్ గలంగినను, వహ్నికి శీతలభావ మబ్బినన్
మేరువ బీటవారినను మేదినికంపము నొంది కృంగినన్
గూరిమి నీకుమారునకుఁ గూర్తుఁ జిరాయువుఁ బట్టువట్టి న
న్నారయ వే! త్రిమూర్తులకు నైన భయంపడ నంచు నెన్నఁడున్.

కావున నీకుమారుని నావెంట బ్రహ్మలోకమున కంపుము. అయ్యెడ సఫలము గాకున్నఁ గైలాసమున కరిగి భూతనాథు నడిగి, యేవిధ మున నైన సాధించెద. నీ వించుకయు సంశయింపకుము.

వసి:—మృకండా! నేను నైతము వెంటనుందుఁ గానఁ దనూజునంపుము.

మరు:—(మృకండునితో) ప్రాణేశ్వరా!

క. పిలువని పేరంటముగా
నలఘుతపోమహితు లిచటి కరుదెంచి యిటుల్
బలుకుదు రె? దీనికిన్
ఫల ముండు నటంచు నెంతు భావమునందున్.

మృకం:—కాంతా! నాకును నట్లే పొడకట్టుచున్నది (మునులతో) తాపసోత్తములారా! పెన్నిధి నిరసించు పేదవాఁ డుండునా! కుమారుఁ గొంపోయి, యచిరకాలమ్మునసే, తిరిగి మాకనులకఱవుఁ దీర్పుఁడు (మార్కండేయునితో) నాయనా!

చ. విమలతపోనిధానులగు ♦ వీరలతో జనుమయ్య సత్యలో
కమునకు సృష్టికర్త యగు ♦ కంజజుదర్శనముం బొనర్చి పా
దములకు మ్రొక్కి నీగని య ♦ తం డిడుదీవనలందు మయ్య ప్రా
ణములను నీపయిన్ నిలపి ♦ నారము వేగము రమ్ము పుత్రకా!

మార్కం:—చిత్తముజనకా! జననీ! నమస్కారము (తల్లికినమస్కరించును)

మరు:—నాయనా! వినయధురీణా!

గీ. తండ్రి పరమోత్తముఁడు నగు ♦ తపసిగాని
నేను జగదంబఁ గొల్చెడి ♦ దాన నేని
ఋషులపల్కులె వేద మై ♦ యెసఁగు నేని
నీకు శుభములు చేకూరు ♦ గాకసుతుఁడ!

తనూజా! పోయిరమ్ము.

వసి:—పుత్రప్రేమచే దిగు లొందక, సర్వేశ్వరు నారాధింపు చుండుఁడు. కుమారునకిసుమంతయు భయము లేదు.

విశ్వా:—మార్కండేయా రమ్ము. (వెళ్లుట నటింతురు తెరపడును)





" శ్రీరామచంద్రపరమాత్మనేనమః "

# మార్కండేయ నాటకము.

## చతుర్థాంకము

### సత్యలోకమార్గము.

(ప్రవేశము ముందు నారదుఁడు వెనుక మార్కండేయ విశ్వామిత్ర వసిష్ఠులు.)

నార:—(తనలో) శ్రేష్ఠ మగుకలహబీజము దొరకినది. ఇది యమ హృదయ మనుక్షేత్రమున నాటి ఫల మనుభవింపవలయు. కానిమ్ము సత్యలోకవిశేషముఁ గూడనరసెద.

మార్కం:—(అనుబంధము—18)

తెరయెత్తగా సత్యలోకము:—బ్రహ్మ, సరస్వతీ కూర్చుని యుండుట కాన్పించును)

ఋషులు:—భారతీనాథా! నమోస్తు నమోస్తు.

బ్రహ్మ:—ఓహో! పరమతపోధను లగు విశ్వామిత్రవసిష్ఠనారదులా! కూరుచుండుఁడు.

ఋషు:—(కూర్చుందురు)

వసి:—మార్కండేయా! సృష్టికర్తకు నమస్కరింపుము (అని జనాంతికముగాఁ బలుకును).

మార్కం:—(చేతులు జోడించి)

సీ. సత్యలోకేశ్వర ♦ జగదేకవంద్య!
నీపాదాంబుజములకు ♦ వందనంబు
కనకాంబరునినాభి ♦ కమలమం దుదయించి
వరలుపరబ్రహ్మ ♦ వందనంబు
పదునాల్గుభువనముల్ ♦ వరుససృష్టించిన
పరమపావనమూర్తి ♦ వందనంబు
అఖిలవిద్యాప్రదా ♦ యనిలోకమాత యౌ
వాణీమనోనాథ! ♦ వందనంబు
గీ. భక్తరక్షణ! నీకిదే ♦ వందనంబు
పతితపావన చారిత్ర ♦ వందనంబు
పద్మగర్భ' దయానిధే ♦ వందనంబు
భవవిదూర! చతుర్ముఖ ♦ వందనంబు.

బ్రహ్మ:—కల్యాణం భూయాత్ కల్యాణం భూయాత్.

ఋషు:—(మోములు వాల్తురు)

నార:—ఈవిషయ మిచ్చట తేలలేదు. విశ్వామిత్రుఁ డింతతో నూరకుండఁడు నాకుఁ గడుపునిండ నోగిరము లభియించుట కే యభ్యంతరమును లేదు.

బ్రహ్మ:—ఋషిసత్తములారా! మీ రేదియో నాలోచింపుచు ముఖకాంతులఁ దొలఁగిన ట్లుంటిరి కారణమేమి?

విశ్వా:—సృష్టి యింతగా నున్న దని,

బ్రహ్మ:—సృష్టి కేమిలోపము? మీ రరుదెంచినకార్య మేమి?

వసి:—మహానుభావా! చిత్తగింపుము. (మార్కండేయునిఁ జూపి) ఈకుమారుఁడు శంకరవరప్రసాదమున మృకండమరుద్వతులకు జన్మించినవాఁడు. నీలకంఠుఁ డీతని నొసంగునాఁడు పదియాఱువర్షము లాయువని వచించె నట; మేము మృకండాశ్రమమున కరిగినప్పు డీతని నమస్కారమునకుఁ జిరాయుర స్తని దీవించి పిదప నమ్మహేశ్వరు

వాక్ప్రశక్తి దెలిసి విచారించి యితని మా వెంటఁ బెట్టుకొనివచ్చి నీపాదములకు నమస్కరింపఁ జేసి నీయాశీర్వచనప్రభావమున మా పలుకులనైతము సార్థకపఱచుకొన నెంచి కొండంత యాసతోఁ జనుదెంచితిమి:

బ్రహ్మ:—అయ్యో! ఎంతవిచారము! నావ్రాలుఁ దుడువ నాకే సాధ్యముకాదని మీ రెఱింగినవిషయమే యయ్యు నిట్లు కోరుట భావ్యమా! నే నిం కేమ నందు?

విశ్వా:—అనుట కే మున్నది? చేయుట కే మున్నది? ఈమార్కండేయుఁడు దీర్ఘాయుష్కుఁడు గాక మాయాశీర్వాదము వ్యర్థ మగు నేని,

ఉ. శీతనగోన్నతస్థలి వ ♦ సించి మహత్తర మైన నిష్ఠ ఘో
రాతపవర్ష బాధలకు ♦ నైన జలింపక రుద్రపాదముల్
ప్రీతిభజించి బ్రహ్మపద ♦ విన్ గయిసేసిన నాతపంబునం
దీతనికోసమై సగ ము ♦ హీనముగాఁ ద్యజియింతు ధాత్రిపైన్.

నార:—(స్వ) బలే! బలే! విశ్వామిత్రహృదయకమలము చక్కగా రవులు చున్నది. నా కింకఁ గొద వేమి? (బ్రహ్మతో) తండ్రీ! వినుచున్నావుకద.

బ్రహ్మ:—విశ్వామిత్ర! కారణములేక కినియుట పాడియా! సమస్తజీవరాసులఁ బుట్టింప నేనును బోషించుటకు శ్రీ మహావిష్ణువును సమయించుటకు రుద్రుఁడును నా నని తెలియునుగద కావున నాతని పాలికిఁ బోయివిన్నవింపుఁడు. నన్ను నెపపెట్టుటవలనం బ్రయోజన మేమి?

వసి:—చిత్తము (తెరపడును)

కైలాసమార్గము

(ప్రవేశము విశ్వామిత్రవసిష్ఠనారదమార్కండేయులు)

మార్కం:— (అనుబంధము--19)

నార:—గాధినందనా! దారుణప్రతిజ్ఞఁ గావించితివి కాని పుట్టించినవాఁడే తనవలనఁ గా దన గిట్టించువాఁడా దయ గనుట!

విశ్వా:—ఏమి? నారదా! బ్రహ్మమానసపుత్రుండ వైనందుకు పక్షపాత మగపఱచు చుంటివే! చాలింపుము చాలింపుము.

నార:—సరిలే నడువుము. (అందఱు నడచు చుందురు)

మార్కం:— (అనుబంధము--20) నిష్క్రమింతురు)

(తెర మెత్తగా కైలాసగిరిపై గౌరీశంకరు లగపడుదురు)

గౌరి:—చిరకాలమునుండి నా శోకసందియము బాధాకర మై యున్నది; దేవర క్షమింతు రేని విన్నవించుకొనియెద.

శంక:— హైమవతీ: ఏ మాసంశయము?

గౌరి:—పరమేశ్వరుని యాజ్ఞ లవిచ్ఛిన్నము లని వేదశాస్త్రము లుద్ఘోషింపుచుండెఁ గద! ఆయాజ్ఞ లన నెవ్వి? ఎప్పు డొసంగఁబడును?

శంక:—ప్రతిజంతువుజన్మించు నపుడు తొలిజన్మములం బట్టి ఫలములు లిఖింపబఁడును. అవియే యీశ్వరాజ్ఞ లని యందురు.

గౌరి:—అటులైన జన్మాంతరసుకృత-దుష్కృతములం బట్టి సుఖదుఃఖములు గలుగుచుండ సర్వమును గర్మ యని తలంపవలయు నే కాని తమ కాపద సంభవించి నపుడీశ్వరా! రక్షింపు మనియాక్రందన మొనరించిన నేమిప్రయోజనము?

శంక:—కొంత పరిశ్రాంతికొఱకును నుత్తరజన్మములో సుఖించుటకును మొర సేయుదురు

గౌరి:—ఈతత్వ మెఱింగినవిజ్ఞులు పరమేశ్వరునికంటెఁ గర్మ గొప్ప దందు రేమో?

శంక:—అది సహజమే. హరిహర బ్రహ్మేంద్రాదు లైననుఁ గర్మమునకు బద్ధు లై యుండవలసినదే

గౌరి:—తమరు మృకండమరుద్వతులకుఁ బ్రసాదించినకుఱ్ఱవానివయఃపరిమాణ మల్ప మగుటకుఁ దల్లిదండ్రులకర్మ కారణమా? తనయుని

కర్మ కారణమా? లేక యాపదియారువత్సరము లనుదాని కితర మగు
నర్థ మేమైనఁ గలదా?
శంక:—(చిఱునవ్వుతో) ఇంతకాలమునుండియుసీ ప్రశ్నలువేయు టిం
పులకా !
గౌరి:—శ్రమకుఁ గోపింపక నాయీసందియమును బాపవేడెద.
శంక:—మదర్ధాంగి వయ్యు నీవిషయ మూహింపలే కుంటివా?
గౌరి:—నే నొకవిధమున నూహించితిఁ గాని అగునా కాదా యని సం
శయించు చుంటిని.
శంక:—ఏ మని తలంచితివి?
గౌరి:—వినుటకుఁ బదియారైనను గణితవరునకు నూటా అగునట్లును
తపోమహిమంబున యోగమార్గమునఁ జిరకాలజీవిత మొసంగుటకు
ను, భూతదయాపరు లగు తాము నిశ్చయించుకొని, నిమిత్తమాత్ర
ముగ నట్లంటి రని భావించితిని. తప్పయిన క్షమింపుఁడు.
శంక:—గౌరీ! నీయూహ మిక్కిలి సమంజసము. అయినను నీవిషయ
మిప్పుడే వెల్లడింపఁ జనదు.
గౌరి:—చిత్తము.

(ప్రవేశము భృంగిరిటుఁడు)

భృం:—జయము. జయము. గౌరీమనోహరా!
శంక:—భృంగీ! విశేష మేమి?
భృం:—దేవా! విశ్వామిత్ర వసిష్ఠ నారదులును వెనుక నొక బాలకుఁ
డును వచ్చు చుండిరి.
శంక:—వారికి శుభప్రవేశ మొనరింపుము.
భృం:—చిత్తము. (నిష్క్రమించును)
శంక:—పార్వతీ! ఋషిత్రయము వెనుక నున్న బాలుఁ డెవ్వఁడో?
గౌరి:—ఒకవేళ, మార్కండేయుఁ డే యగు నేమో!

(ప్రవేశము మునులు మార్కండేయుఁడు) (అనుబంధము-21)

విశ్వా:-సీ. రజత శైలని వేశ! ♦ భుజగభూషణ బంధ,
భవపాశనాశ! తు ♦ భ్యం నమోస్తు
వసి:- గిరిజామనోనాధ ♦ గరళశోభితకంఠ,
పరివిమలదేహా! తు ♦ భ్యం నమోస్తు
నార:- గంగాతరంగోత్త ♦ మాంగ! సత్కరుణార
సాంభోధి దేవ! తు ♦ భ్యం నమోస్తు
మార్కం:- భక్తావనోల్లాస! ♦ పరితతభిక్షుకవేష,
ఫాలాగ్నినేత్ర! తు ♦ భ్యం నమోస్తు.
గీ సకలభువనైకవంద్య! ప్రి ♦ శస్తహృదయ!
యోగిజనహృద్వనవిహార! ♦ రాగరహిత!
నందివాహా! మహేశ! బా ♦ లేందుమౌళి!
యగణితోత్తమచరిత తు ♦ భ్యం నమోస్తు.
(శిరము వంచి నమస్కరించును)

శంక:—మనోవాంఛితార్థసిద్ధి రస్తు.

ఋషు:—ధన్యోస్మి! ధన్యోస్మి! పరమేశ్వరాశీర్వచన మమోఘమై వెలయుం గాక.

(అని చేతులెత్తి నమస్కరింపుచుండ- తెరపడును.)

(అరణ్యమార్గమార్గము. ప్రవేశము ఋషులు మార్కండేయుండు.)

మార్కం:—(అనుబంధము-22)

నార:—నిటలాక్షుండు "మనోవాంఛితార్థసిద్ధి ర"స్తని. దీవించెంగాని నా కించుక సందియ మగుచున్న దేమందువు? కౌశికా!

విశ్వా:—ఎందువలన?

నార:—ఈకుమారుండు గాని ఈతనినిమిత్తమై మనముగాని వాంఛించి నదిదీర్ఘాయు వగుట నీశ్వరాశీర్వచనమున నది సమకూడునుగాని "పదియాఱువత్సరము" లనిమున్నువచించుటకుం గారణ మేమి? దాని కిప్పుడేరీతి మార్పు కలుగును? పరమేశ్వరుం డది మరచెనా? మ

నమనోగత మెఱుంగఁడా? యేయితరకారణమైనఁ గలదా! యిది యే నాసంశయము.

విశ్వా—ఈశ్వరునకు మరపు జనించుట కల్ల. ఆశీర్వచనము నెఱవేఱుకుండు టంతకంటె నసత్యము గద? కాని తొలుత నట్లాన తిచ్చుటకుఁ దగినగోప్య మగుభావ మేదియో యుండ నగుఁగాన సంశయవిముక్తుల మై బాలునిఁ గొంపోయి జననీజనకులఁ జేర్పుదము.

వసి:—ఇయ్యది నిశ్చయము. అయినను పరమేశ్వరాశీర్వచనము నెఱుంగక గడువు సమీపించు నప్పటి కీతనిఁ గొంపోవ యమదూతలు గాని యముఁడుగాని రావచ్చును. అందుచే నీచిఱుతఁ డిప్పటినుండియు నప్రమత్తుఁడై తపస్సమాధిం బ్రవేశించె నేని మృత్యువునకుఁ జంకవలసిన యగత్యముండదు సగికదా; తనదాసుని బాధించు కాలుని వారించుటకై భక్తపరతంత్రుఁ డగుశంకరుఁడు సాక్షాత్కరించి సంవర్తిని వారించి యీతని రక్షించుటయే గాక తనగాంభీర్యాభిప్రాయమును లోకమునఁ వెల్లడింపఁగలఁడు. కావున శంకించుట కవకాశ మెంతమాత్రమును గలుగదు.

నార:—ఇ దంతయు నాకుఁ గోచరమే యయ్యు మీయభిప్రాయములఁ గనుఁగొనుట కట్లంటిని. ఇఁకఁ బోవుదము రండు. పాపము; కుమారునికొఱకు వారు నిరీక్షించు చుందురు.

మార్కం:— (అనుబంధము-22)

(అందఱు నిష్క్రమింతురు)





"శ్రీరామచంద్రపరమాత్మనేనమః"

# మార్కండేయ నాటకము.



## పంచమాంకము.



(పర్ణశాలముంగిట మరుద్వతి కూర్చుని యుండును)

మరు:— (అనుబంధము--23)

కష్టా! బ్రహ్మలోకవిశేషములేమో తెలియవు. సుతుండింకను రా
కున్నవాఁడు! ఈశ్వరనిర్ణిత మగునిర్యాణకాల మిఁక నొక్కవత్సర
ములోఁ బూర్తి కానున్నది. నా ప్రాణములు సుడివడుచున్నవి. దుఃఖ
పరంపరలు పొరలి పొరలి వచ్చుచున్నవి. హా! తనయా! నాయట్టిదు
రదృష్టరాలిగర్భమున జనింపకున్న దీర్ఘాయుష్కుఁడ వయ్యెడివాఁడ
వేమో కద? తండ్రీ! నీచేతులమీఁదుగ దాటిపోయెడిభాగ్యమున
కేనోఁచితినో లేనో కద! అయ్యో! కుమారా! (అని దుఃఖించుచుండ)

మృకం:—(ప్రవేశించి) (స్వ) ఆహా! ప్రణయమహిమ . మనిర్వాచ్య.
ము-(ప) మరుద్వతీ! విలపించినఁ బ్రయోజన మేమి? ఈశ్వరాజ్ఞకు
వేచి యుందము. కుమారునిముఖంబున భవితవ్యము నెఱుంగవల
దా? ఊరడిల్లుము.

మరు:—ప్రాణేశ్వరా! ఇంకఁగుమారునోట వినవలసిన దేమి యుండు
ను! అట్టి యదృష్టమే యున్న నింతపుట్టునా? కుమారనామస్మరణ
మాత్రమున గుండె లవియునా?

మృకం:—కాంతా! ఎంత వెఱ్ఱిదానవు?

గీ. ఎలమి సస్యాఢ్యముగ ఫలి ♦ యింప జేయు
వర్షఋతువున కాదిని ♦ భయదమేఘ
గర్జితార్భాటములు గల్గు ♦ కరణిఁ గాగ
సుఖములకుఁ గష్టములె వచ్చు ♦ చుండు మొదల.

అట్టికష్టసమయమునం దోరిమియే ప్రకాశింపవలయు.

ఇదియునుంగాక విశ్వామిత్రుఁడు ప్రతినఁ బూనుటచేఁ గొంచమాలో చింప వలయు. అతడు నిరుపమానతపోబలసంపన్నుఁడు సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేయఁగల సమర్థుఁడు. ఆతని వెంట నున్న వారు నారదవసిష్ఠులు అప్రతిమానసహజవైరానలజ్వాలాకర్షితచిత్తులగు విశ్వామిత్రవసిష్ఠులును, కేవలకలహభోజనుఁడై భువనములఁ డీకొల్పి తారుమారుఁ జేయఁగలతంపులమారి నారదుఁడును, తమతమవర్తనలమాని యన్యోన్యసహాయులై మనకుమారుని విషయమై పట్టుదల వహించుటచే సరియగుఫల ముండును, కుమారుని వారలతోఁ బంపునపు డీయది నీవే నుడివితివి గద?

శిష్యు:—(ప్రవేశించి) ఆచార్యా! కుమారసహితముగఁ దాపసు లేతెంచుచున్నవారు.

మృకం:—మహాభాగ్యము.

మరు:—(ఆతురతతో) నాయనా! ఎంతదూరముననుండిరి?

శిష్యు:—అమ్మా! ఇదిగో సమీపమునకేవచ్చిరి.

మృకం—
మరు:— } (లేఁచి యెదురుగా బోవుచుండుట నటింతురు)

మరు:—(స్వ) కట్టా! ఏమని వింటినో కద.

ఋషు:—(కుమారునితోఁ బ్రవేశింతురు)

మృకం:—మునితల్లజులకు స్వాగతము.

మార్కం:—జననీజనకులారా! నమస్కారము.

మృకం:— }
మరు:— } తండ్రీ! రమ్ము.

విశ్వా:—(మృకండునితో) విభాండకుమారా! సర్వము శుభ మయ్యె. ఆనుపూర్వికగా మీానందమునివలనఁ దెలియుదురు గాక. మేము పోయి వత్తుము. మార్కండేయా! సుఖంబుండుము.

మృకం:— }
మరు:— } మహాత్మా! నమోస్తు.
మార్కం:— }

ఋషు:—విజయీా భవ! విజయీా భవ.

నార:—(స్వ) ఇఁకనాపనిమీాద, నే నుండవలయు.

(విశ్వామిత్ర వసిష్ఠ నారదులు. నిష్క్రమింతురు)

మరు:—(కుమారుని తలవెండ్రుకల నవరించుచుండ)

మృకం:—బిడ్డా! గిరిగహ్వర ఘోరారణ్యమార్గగమనమునఁ జిగురుటాకులం బోలునీపాదము లెంతనొచ్చెనో!

మార్కం:—జనకా! ప్రేమచే నడిగితిరి కాని సర్వేశ్వరుఁడు సర్వకాలములయందు, సర్వవిధముల దయఁగలిగి సర్వాంతర్యామియై, సహస్రనేత్రములచేఁ గనిపెట్టుచు, సంచరించుచుండ నాతనిచరణదాసులకు శ్రమ యుండునా?

మృకం:—కుమారా! నిజము.

మరు:—నాయనా! సత్యలోకవిశేషము లేమో వినిపించెదవా?

మార్కం:—జననీజనకులారా! సత్యలోకమునుండి కైలాసమున కేఁగవలసివచ్చుటచేఁ జని శంకరు దర్శించి నమస్కరింప, నమ్మహేశ్వరుఁడు «మనోవాంఛితార్థసిద్ధిర» స్తని దీవింప మనోవాంఛ దీర్ఘాయువే యగుట సంతసించి, సెలవుఁగైకొని వచ్చుచుండ, వసిష్ఠులవారిట్లని యాన తిచ్చిరి.

మరు:—ఏమని తండ్రీ!

మార్కం:—ఈశ్వరుఁడు విస్పష్టముగ దీవింపక గంభీరముగఁ బల్కెఁ గాన, నది స్పష్టీకరించుట కీకుమారుఁ డిప్పటినుండియుఁ దపస్సమాధిం బ్రవేశింపవలయు నని వక్కాణించిరి.

మరు:—నాయనా! మే మింకను నిశ్శంకహృదయులమై జీవించువున్నెము గలుగ దయ్యనే! మ మ్మీవిధమున డించి, నీవొక్కండవే తపంబున కేగెదవా? మే మెట్లు బ్రతుకుదుము. మమ్ముఁగూడఁ దీసికొనిపొమ్ము. భగవంతునిదయయెట్లు పరిణమించినను, ని న్నను సరించియేయుందుము.

మార్కం:—తల్లీ! తపంబునకై యొంటరిగను, విద్యకై సహవాసము తోడను జనవలయునని, పెద్దలు వచింతురు గద! అట్టిచో నిట్లు కోరదగునా?

మరు:—పుత్రకా! యె ట్లెడఁబాసి యుండఁగలము?

గీ. రంగదుత్తుంగభంగత ♦ రంగజంతు
సంకులం బయి ఘోషించు ♦ సంద్రమునకు
నరగ నెన్నటి కేనిఁ బ్ర ♦ శాంతికలుగుఁ
గాని, మాదుఃఖమున కంతు ♦ కలుగదయ్యె.

మృ:—(భగవంతు నుద్దేశించి) ఆహా! పరమేశ్వరా! నీనిర్ణయము లెఱుంగ నసాధ్యము.

మార్కం:—అమ్మా! విధినియోగము దాట నలవి యగునా? పరమేశ్వరుఁడునైతము, కర్మబద్ధుఁడై, యనేకగతుల సంచరించు చుండలేదా?

ఉ. తిండికి లేదొ? కట్టుకొనఁ ♦ దెల్లనివస్త్రమె లేదొ? భాగ్యమే
యుండదొ? ఏమిలోటు తన ♦ కుండెఁ? జతుర్దశలోక నాథుఁడై
యుండెడిశంకరుండును, మ ♦ హోగ్రభయంకర కర్మచేతఁగా
కుండినఁ బేదవాని యటు ♦ లుండఁగఁ గారణ మేమి? తెల్పుఁడీ!

సర్వప్రపంచము కర్మ యనురజ్జువుచే బంధింపఁబడి యుండుట మీ రెఱుంగరా?

మృకం:—తండ్రీ! పసివాఁడ నయ్యుఁ బరిపూర్ణజ్ఞానముఁ గలనీతో నే మని మాట లాడుదును?

మను:—నాయనా! మా కిం కేది గతి? యెవరు దిక్కు? ఎంతటిదుష్కాల మాసన్న మయ్యెను? అయ్యో! నాతండ్రీ! ఎట్లు పొమ్మని చెప్పఁ గలను? నే నేల బ్రతికి యుంటిని? (విలపించును)

మార్కం:—అయ్యయ్యో! దుఃఖమున కిప్పు డేమి యవకాశము? మ ఱికొంతకాలమునకైన నాశరీరము నాశ మొందక శిలవలె నిలచి యుండునా? శిల యైనను గొన్నినాళ్లకు ఖిలమై పోఁగలదు. బుద్బుదప్రాయ మగుదానికొఱకు విలపించు టెందులకు? నిజముగ నాలోచించినచో

సీ. కఫవాతపైత్యరో ♦ గములచేఁ గృశియించి,
మారణంబై పోవు ♦ మట్టిబొమ్మ
దుర్మోహవాంఛితా ♦ దులఁ జిక్కి చెడిపోయి
హేయమై నశియించు ♦ మాయబొమ్మ
రక్తమాంసాదిమ ♦ ద్గంధభూయిష్ఠమై,
రాలి పోయెడు నట్టి ♦ తోలుబొమ్మ
మలమూత్రజంతుసం ♦ కులమై మహాగ్నిఁ జే
కొని కాల్పఁబడునట్టి ♦ కొయ్యబొమ్మ

గీ. పుడమిపై నాల్గుదినములు ♦ బొమ్మలాట
తనువు శాశ్వతమనుచును ♦ దలఁపకమ్మ
అమ్మ! "జాతస్యమరణంధ్రు" ♦ వమ్మటంచుఁ
బలుకు టే సత్యమగు నని ♦ తలఁపు మమ్మ!

ఈషణత్రయముల వర్జించి, కామాదిశత్రులకు లోఁబడక సర్వము

సర్వేశ్వరుఁడే యనునిశ్చలచిత్తమున నాతనిచరణముల భజించువా
రలకే మోక్షము కరతలామలక మనుధర్మసూత్రములఁ బాగుగా
నెఱింగి గేస్తురాండ్రలోనగ్రగణ్యత వహించిన పరమపావనివి నీవును
అనిమిషులచేసైతము బొగడ్తఁ గాంచినమునిజనమూర్ధన్యుఁడగు
తండ్రియు నస్థిరమైననాతనువుకొఱకు విచారపడు చుంటిరే కాని ముం
దుత్రోవఁ జూచుకొనరైతిరి. ఒకవేళ నే జీవించియుండగనె మీకు
కాల మాసన్న మగు నెడల నీకుమారనామకశాఖపై దట్టముగ నల్లు
కొనఁబడినమోహలతఁ దెగఁగోసి పోవుదురా? లేక, మృత్యువుతో
బోరాడి జయించి నన్నెడఁబాయక యుండఁగలరా? అదియెంతకష్ట
ము? ఏజీవముఁగాని జన్మజరామృత్యుభయంబులకు వెలియై సుఖ
ముగా మనియుండఁజాల దనుట మీ రెఱింగినదే కద? ఇదియునుం
గాక నేను మీసుఖముఁ గాంచి భరింపఁజాలక బ్రతికినంతకాలము
మి మ్మెడఁబాయకయే యుందు ననుకొనుఁడు. మన్మనస్సారంగ
మాయుమామహేశ్వరచరణారవిందవిహార మొనర్చుచుండ నిమిత్త
మాత్రచైతన్యముగలనాశరీరము మీయొద్ద నున్న నేమి? లేకున్న
నేమి? ఇది యిటుండ నింకొకటి చిత్తగింపుఁడు ఈశరీర మనుచున్న
పుతిత్తి ద్వారములతో, నాడులతో, నరములతో, నెముకలతో,
రోమాంచములతోఁ, గవోష్ణరక్తప్రవాహముతో, బలిష్ఠమై సుం
దరమై లాఘవమై విశాలమై యున్నను పంచప్రాణములం గల్గి యు
న్నం గాని ప్రయోజనకారి కాఁజాలదు. ఆపంచప్రాణములను పృథి
వ్యాప స్తేజోవాయురాకాశము లనుభూతపంచకసంబంధమైనవై యుం
డును. అట్టిశరీరము నశించినప్పుడాభూతము లాయాస్థలాంతరముల
నలంకరించును. అందుచే జీవాత్మకు మాత్రము నాశ ముండదు.
ఆపంచభూతములే పవిత్రములైన మీశరీరములందును నాశరీరమం
దును సమస్తచరాచరంబులయందును వర్తించుచుండుటచే నే నగప
డకున్నను మీలో నైక్యమై మిమ్ము సేవించుచునే యుందును. ఇ

దియంతయు మీహృదయములనాటినదే యగుట చింతింపవలసిన యగత్య మేమి? నే నేల మరణింతు నని విచారించెదరు? నిశ్చలత పస్సమాధియందుండువాఁడెన్నటికిని నశింపఁడనియోగశాస్త్రములు ఘోషింపుటలేదా? కైలాసాచలమున కేఁగి చంద్రమౌళీశ్వరు దర్శించి సాష్టాంగనమస్కార మాచరించి నప్పు డాపరమేశ్వరచరణసరోజస్పర్శచేఁ పవిత్రీభూతమైన మదుత్తమాంగము మృత్యువునోటఁ జొప్పింపఁ బోవుచుంటినా? (అనుబంధము--24)

మృకం:—మరుద్వతీ! కుమారుఁడు వచించినవిషయములం దొక్కటి యుఁ దీసిపోవునది లేదు. భగవంతునిపై భార ముంచి యాశీర్వదించి పంపుదము. ఇంతకంటె మన మే మొనరింపఁగలము? విచారింప కుము (కుమారునితో) తనయా! పిపీలికాది బ్రహ్మపర్యంతవ్యాప్తుఁ డగు సర్వేశ్వరుఁడు నిన్నురక్షించుగాఁక.

మార్కం:—తల్లీ! నీయాజ్ఞం గూడ దయసేయుము.

మరు:—(దుఃఖముతో) అయ్యో! ఇం కేమిచేయుదు? నా ప్రాణములు, చలించు చున్నవి. సర్వప్రపంచము నాకనులకు దుఃఖమయ మైకనుపించుచున్నది. ఓ భగవంతుఁడా! వృద్ధులము. చిరకాలమున కీకుమారుఁ గనినారము. ఇతనికన్న వేరుదిక్కును లేనివారము, త్రుటికాలమేని సుతునివిడనాడి బ్రతుకలేనివారము మునిదంపతులము మాపై నించుక దయయుంచుము దీనజనావనుం డనుబిరుదుఁగలాడవు. ఓతల్లీ! భక్తజనకల్పవల్లీ! శాంకరీ! నీ వీకుమారు నొసంగునాఁ డల్పాయుష్కుఁ డగుట కేను జింతింప నారు వోసినవాఁడు నీరు వోయ కుండునా ” యని యోదార్చినదయారసభగతవు. అట్టినీచరణముల నమ్మి సమ్మతింపవలసెఁ గాని లేకున్నఁ బుత్రవిశ్లేషణము సహింప దరమా? నీవెఱుంగవా? ఇతఁడునీబిడ్డఁడు గాని నాబిడ్డఁడు గాఁడు. నీవే శరణ్యము. ఈయాడుకూయి యొకింత యాలకింపుము లేదా న న్నంత మొందింపుము.

మార్కం:—తల్లీ! నీవూరడిల్లక తప్పదు (అనుబంధము. డైలాగ్ 25)

మరు:—హా! కుమారా! ఎంతలో సర్వసంగపరిత్యక్తుఁడ వైతివి! ఓయా శ్రమమృగంబులారా! మీచెలికాఁడు సకలసుగుణాలవాలుఁడు, మార్కండేయుఁడు,మీరెల్లరాశీర్వదింపుఁడు. ఓవిశ్వామిత్రవసిష్ఠనా రదాదిమునిచంద్రులారా! మీరెల్లరు దీవింపుఁడు. ఓసిద్ధులారా! సు రలారా! మాతనయునిఁ గాపాడఁ బ్రయత్నింపుఁడు. ఓశంకరా! ఓశంకరా! ఓభార్గవీ! ఓకుమారా! హా! మోహము! ప్రాణము. తనయుఁడు. తపము. దుర్భరము. దుర్భరము. దుర్భరము.

(నేలపైఁ బడును. తెర వాలును)

(ఇచ్చట ప్రేక్షకజనవిరామము)

(అరణ్యప్రదేశము మార్కండేయునిప్రవేశము)

మార్కం:— (అనుబంధము 26)

ఔరా! పరమేశ్వరులీల లెంతచిత్రములు! ఎంతదురవగాహములు! నేను జన్మించిన దొకపర్ణశాల! కనినవారు పరమతపోనిధానులు! విద్యా లోసంగియవివేకాంధకారముఁ బోఁదోలిన దేశికుఁడు తిరస్కృతవాచ స్పతియనం దగు కణ్వాబుషి; దర్శించినవి సత్యలోకకైలాసములు.త పోమార్గదర్శులు విశ్వామిత్రవసిష్ఠనారదులు! భజింపఁబోవునది నిఖిల లోకకల్యాణకరంబు లగు శంకరునిచరణంబులు! నడచుచున్న దరణ్యా మార్గము; ప్రాయమా! పదియాఱవవత్సరము ప్రవేశించినది! సహ వాసులా ప్రస్తుత ముండరామిఁ గోరఁదగదు. పోనిమ్ము. దైవమే తోడుగట్టెనమ్మకమున నేఁగుచు న్నను ఈమార్గమిచ్చటినుండి నాల్గుభాగములుగాఁ జీలిపోయె. ఏతోవ యెచ్చటికేఁగునో తెలి యదు. తెలుపువారును లేరు. ఇదంతయు భగవన్నిర్మాణముగాక యితర మగునా? దీనింబట్టి చూడఁగా దరచినకొలఁది వెన్నగట్టిప డునట్లు, శ్రమకు సహించిననిరూఢభక్తిచేఁగాని జన్మరాహిత్యము

దొరక దనునీతివాక్యము స్మృతికిఁ దగులుచున్నది. అట్టినిర్మలపదవి సమకూర్చుటకే భగవంతుఁడు తనభక్తులగువారి కనేకసంకటము లఁ గూర్చుచుండును. ఏబాధలకైన నోర్చి మనోవాక్కాయకర్మ లచే సర్వము భగవదర్పణముగా నెవరు సంచరింతురో యట్టివారే ధన్యులు. మృత్యువునైతము వారి డాయఁ జాలదు. నేనిప్పుడు సదాశివుసేవింపఁ బోవుచుంటిఁ గాన నయ్యీశానుఁడు నివసించుప్రాగుత్తరదిఙ్మధ్యగాఁ బోయెడి నీబాటనే చని నారదాద్యుపదేశము నేరవేర్ప నుపక్రమించెద. (భగవంతు నుద్దేశించి) ఓదయాసముద్రా! పరాత్పరా! శంకరా!

మ. తలిదండ్రు ల్తనయాయటంచుఁ గడువం ♦ తన్ మున్గి శోకింపవా
రల నట్టే డిగనాడి పాప మనుచున్, ♦ రవ్వంతయోజింప నై
తిలలిన్ నీ వరపాదపద్మములయం, ♦ దే చిత్తము న్నిల్పితిన్
మల యింపన్ బడఁజాల దర్శనము ని, ♦ మ్మా! భక్తసంరక్షణా!

(నిష్క్రమించును)

(ప్రవేశము నారదుఁడు)

(భజగోవిందం)

ఓదయామయా! సకలవేదస్వరూపా! విశ్వరూపా! పరాత్పరా! నీచరిత్రలెంతవారికిని వర్ణింప నశక్యములు గద! నిను నమ్మక చెడిపోయెదరు గాని, నమ్మినవారికిఁ గొంగుబంగరువుంగద! ఏది నీచిద్విలాసము గాదు? నీ వెందుండవు? అట్లే కానిచో శ్రమలకు సహించి ఘోరారణ్యములం బడి పోవుచున్నమార్కండేయునకు మార్గమధ్యన మృతకంతేశ్వరుఁ డనులింగాకారమున సాక్షాత్కరించి సేవఁ జేయించుకొందువా? ఈమూలమున నా కోరికము లభించునా? ఇదంతయు, వాచా మగోచరుండ వగుభవత్సంకల్పము. నే నింక యమాలయమున కరిగి మార్కండేయునిజోలికిఁ బోవల దనియు

రక్షింపు మనియు, జాలి జనించునట్లు జెప్పి యాతఁ డంగీకరింపనిచో గతించినవృత్తాంత మంతయు నెఱింగించి అలుకఁ బుట్టించి యీకుఱ్ఱవానియొద్దకు రప్పించెద. అప్పుడు తనభక్తుని బాధించుట కేతెంచినప్రేతనాథు వారించుటకై శంకరుఁడు స్వస్వరూపమునఁ బ్రసన్నుఁడై మునిబాలకు రక్షించి, యముని శిక్షింపక విడువఁడు. అస్మదాదుల కప్పుడు గాని పూర్ణముగ నానంద మొదవదు. ఈవిషయమునఁ గాని కలహాభోజననామధేయము సార్థకతఁ గాంచదు. నిరుపమానభక్తాగ్రేసరుఁడును శంకరవరప్రసూతుఁడును నగు నీడింభకుఁ డీయెడనే యుండి నిర్దుష్ట మగు నీశ్వరారాధన నెరవేర్చుచుండుఁ గాక. కర్తవ్యమున కేఁగెదను.

(భజగోవిందం) (నిష్క్రమించును)

(తెర యెత్తగాఁ స్ఫటికలింగాకారము మార్కండేయుఁడు గనంబడును)

మార్కం:— (అనుబంధము-29)

ఓతండ్రీ! అమృతకంఠేశ్వరా! నాపై నింకను దయరాదా! భక్తపరతంత్రుఁడవే! నీభక్తులై నాతలిదండ్రులైన వృద్ధులయెడనేని జాలిఁ దలంచి నన్ను రక్షింపుము నేను నీపుత్రుఁడను గానా? కుమారునిపరితాపము గాంచుచుండియు, జగదేకరక్షకుఁ డగుజనకుఁ డూరకున్న నింకనాబిడ్డని కెవరు దిక్కు? సకలదిక్కులనుండి "రక్షకుండొక్క శంకరుడే" యని విన వచ్చుచుండ నింకెవ్వరి సేవింతు? మఱియు నోయీశ్వరా?

సీ. ఆకాశ గోళమం ♦ దవతరించి వెలుంగు,
లలితమౌ నక్షత్ర ♦ ములనుగాని,
గంగాతరంగసం ♦ ఘాతాంతరోద్భూత
విస్ఫురచ్ఛీకర ♦ వితతిఁగాని!
శత్రురాట్ప్రియపర ♦ స్వరవిజృంభిత దారు
ణాగణితాశుశ ♦ రాళిఁగాని,

వర్ణనాతీతదు ♦ ర్వారవర్ష సమయ
హారిసద్వర్ష ధా ♦ రాళిఁ గాని,
గీ. చేరి లెక్కింపవచ్చు న ♦ చింపవచ్చుఁ
గాని, సర్వామర శ్రేణి ♦ కైన నీదు
మహిమలెన్నంగదరమె? యు ♦ మామహేశ!
భక్తజనపోష! సర్వేశ! ♦ భవవినాశ!

శంకరా! శివా! నినునమ్మినవారి కేలోపమును రానీయవని వేనోళ్ల నాలకించితి. నిన్నాశ్రయించితి. శిశుస్త్రీగోభూసురహత్యలొనరించు పరమపాతకులైనను శివా యను నీపవిత్రనామాక్షరద్వయ మొక్కమారు నోరారస్మరించినంతనె సకలమహాపాపములఁ బటాపంచ లొనరించి సద్గతు లొసంగుదువట అట్టి పతితపావనబిరుదము గల లోకరక్షకుండవు నన్నేల బ్రోవవు? ఏల నామొ రాలకింపవు? ఓగంగాధరా! నా కీతుచ్ఛశరీరముపై నాసలేకున్నను జీకు లగుతలిదండ్రుల కొఱకవేక్షింపవలసె. నీవు కరుణార్ద్రదృష్టుల నన్ను గారవింప వేని కుమారునికై యడలి యడలివా రట్టె నశింతురు. కావున నో దేవా! వారిప్రాణంబు లుండునంతవఱ కేని నన్ను మనుపుము. నీవొసంగిన యాయుఃప్రమాణము నేటితో సమాప్తము గాఁబోవుచున్నది. యమభటు లరుదెంచి కొంపోఁగలరు. ఓయార్తజనశరణ్యా! నిన్నే నమ్మితి. నిన్నే ధ్యానించితి. రక్షమాం! రక్షమాం రక్షమాం (అని కనులుమూసి ధ్యానించుచుండును)

(ప్రవేశము ఇద్దఱు యమభటులు)

1-భటు:- అతఁడే మార్కండేయుఁడు సమీపించి ప్రభునాజ్ఞ నెరవేర్చుదము.

2-భటు:-దీర్ఘకరా! కింకరవృత్తిఁజరింపవలసినది నిజమేయైనను, తదేకధ్యానమునను న్నవాని నియతికి భంగముఁ గలిగించు టపాయకరమేమో?

1-భటు:-అపాయమా? ప్రచండదండధరుని కింకరుల మగుమనమిట్టు శం

కింపవచ్చునా? నీకు సందేహమైన నావెనుక నుండుము. నేను ముం
దుండి పలుకరించెదను (అనిసమీపింపబోయి వెనుకకు దగ్గి) ఆహా!
ఏమిది? వేడిగాడ్పులు వీచినట్లు శరీరమున తాపాటము గలుగు
చున్నదే! ఇది యీతనితపఃప్రభావ మగునా? (ఆలోచించి) అగుఁ
గాక. ఇచ్చటనుండియె పలుకరించెదను. (ప్ర) ఓవిప్రకుమారా!
నేటితో నీయాయుర్దాయము చెల్లిపోయినది. మాయేలిక యుత్తర
ప్రకారము యమపురంబునకు బోవ బయలుదేరుము.

మార్కం:—(ధ్యానమునే నటించు చుండును)

భటు:—ఓయీ! కదలి రావేమి? మాటాడవేమి! ఆలస్యమునకు సహిం
పము. నిన్ను విడువము. లే లేచిరమ్ము.

మార్కం:—(కనులు విచ్చి చూచి) (స్వ) ఓహో! వీరు యమభటు
లు కాఁబోలు (ప్ర) యమదూతలారా! దేవతారాధన పూర్తి
యగునంతవఱ కాఁగుఁడు. నన్నుఁ దొందర పఱపకుఁడు.

భటు:—ఆఁగుట కెంతమాత్రము వీలు లేదు. నీవు చెప్పినట్లు నిలచి
యుండుటకు నీనౌకరులము గాము.

మార్కం:—సగముపూజ యైనది, మిగిలినది త్వరలో ముగించి
వచ్చెద నుండుఁడు.

భటు:—వీలు లేదు. ఈరాతినిఁ బూజించిన నేమిలాభము? తక్కినసగ
ముమాప్రభువున కర్పింతువు గాక. లేఁచి రమ్ము.

మార్కం:—ఔరా! ఏమిటి కానోటిదురుసు? మీప్రభువు మిమ్మాయ
వ్యక్తపుమాట లాడుట కేపంపెనా? సేవకులవాక్పారుష్యము ప్రభు
మర్యాదలఁ గలఁగింప కుండునా? మీరు దూత లగుటచే శాంతింప
వలసె. నింక నిట్టిదుండగముల నాచరింపక దేవతార్చన యగు నం
తవఱకు నిలువుఁడు. కా దేని మీనేతను డాసి "భగవత్సేవకు
భిన్న మాచరింపఁ జాల" నని విన్నవించితి నని తెలియఁ జేయుఁడు.

భటు:—ఓయీ! డింభకా! పిట్టకొంచము కూతఘన మని నట్లు

జానేఁడు లేవు! మమ్ము క్షమించువాఁడవా? మాదర్శన మైనంత
నె సకలప్రపంచమును గడగడ వడంకుచుండ నీవేమో నిర్భయము
గ మాట లాడెదవే మాగదాముద్గర పాశంబుల పాలయ్యెదవు సుమా!
జాగ్రత!

మార్కం:—(స్వ) ఆహా! మూర్ఖులమొక సామవాక్యములు నిష్ప్ర
యోజనము లగుఁగదా (ప్ర) ఏమీ! మీరా? నన్ను బాధలఁ బెట్టు
వారు? మీదర్శనము సకలలోకసంక్షోభకారణమా? ఔరా ఏ
మీ వాగ్విజృంభణము?

శా. దంభంబుల్ పచరించి భీకరగదా ♦ దండప్రహారక్రియా
రంభత్వంబునభీతిఁ గొల్పి బలగ ♦ ర్వస్ఫూర్తిఁగొంపోవఁగా
సంభావించితి రేమొ? యేటికి వృథా ♦ సందర్భముల్ సాగఁనే
శంభుం గొల్చెఁడువారిపట్లఁ జనుఁడీ ♦ శంకింపకుండన్ వెసన్.

1. భటు:—ఔరా! ఏమని ప్రేలితివి? మాది వృథాప్రయాసమా? నిన్ను
గొంపోఁజాలమా? నీశంభుని గింభుని లెక్కసేయము. పూజాద్రవ్య
ములు గీజాద్రవ్యము లావల బాఱవైచి నిన్నీడ్చుకొని పోయెదము.
నీ కేవ రడ్డము వచ్చెదరో చూచెదము గాక. సిగ్గులేని పిరికిజంగము
గొలచుటచే మత్తెక్కి మమ్ముఁ దృణీకరించెదవుగా?

మార్కం:—ఓరీ పాపిష్ఠీ! నన్ను నిందింతువు గాక పాంచభౌతికప్రపంచ
మంతుఁ గలసమస్తచరాచరంబులకు నాధారభూతుఁ డగుమహాదే
వునిం గూడదూషించుచుంటివే మూర్ఖా! ఫాలాక్షుని నిందించుట
ఘోరపాతకముసుమా? తూల నాడకుము. నేను మీబిభీషికలకుఁ
జలిప ననినమ్ముము.

సీ. చటులదంష్ట్రాగ్రవి ♦ కటకరాళుర మిమ్ము
గని భీతిఁబడ దుష్ట ♦ జనుఁడగాను
ఘంటానినాదభీ ♦ కరగదాహతులకు
వెఱఁ గంది కుందఁ గా ♦ వెకలి గాను

39466 20-1-90

తతదయాహీనసం ♦ గతదుర్భరార్భటుల్
సరకుసేయగ ♦ నీచనరుఁడగాను
త్వత్పాశబద్ధవి ♦ హ్వాలుఁడనై భాధఁ ద
ప్పించుఁడీ! యని యాశ్రి ♦ యించఁ బోను

గీ. ఎవ్వనిగ నెంచినారొ? మ ♦ హేశశంక
త్రిపురరక్షస్సమూహాభ్రా ♦ రిప్రతాప
మారణోద్దండనేత్రాగ్ని ♦ మండలునకు
నాప్తభక్తునిఁగా మది ♦ నరసికొనుఁడు!

1. భటు:—ఓరీ! గర్వోన్మత్తవ్యర్థప్రలాపి! నీవంటిభక్తులను వేలకువేలు చూచితిమి గాని గర్వించి పేరెఁడువానిమాత్ర మీవఱకెఱుంగము. నీరుద్రునివిషయమై మాకడ బలుకకుము మే మించుకేని సరకుగొనము. లేచి రమ్మా.

మార్కం:—(స్వ) ఛీ! ఛీ! ఈదుర్మార్గులతో మాట లాడఁగూడదు (మఱలలింగము డాసి) తండ్రీ! సర్వేశ్వరా! ఇనుమునుఁబట్టి యగ్నికినిసమ్మెటపెట్టునట్లు నన్ను గుఱించి నీ వీనీచులచేఁబడరానిపల్కులఁబడవలసి వచ్చె గద! దీనికి నేను కారణుఁడ నగుటచే నన్ను క్షమింపుము (అని నమస్కరించుచుండును)

1. భటు:—నిన్నుఁక్షమించినను శిక్షించినను మాప్రభు వగుయమధర్మరాజునకే చెల్లును గాని తదితరులచేఁ గాదు. నిరుపమానపరాక్రమైకదక్షుండును దుర్నిరీక్ష్యుండును నగుకాలుని సామాన్యుఁ డని తలంచుచుంటివి కాఁబోలు? జాగ్రత!

మార్కం:—నమస్తే శంకరా! శివా!

1. భటు:—ఔరా! యేమినీతలపొగరు! ఏమి నీకండకొవ్వు! ఏమి నీతిరస్కారము. ఇంచుకయు వెఱవ కుంటివే?

మార్కం:—ఓయీ! జ్ఞానశూన్యప్రలాపి! మిక్కిలి దుర్భాష లాడకుము. వినుము.

ఉ. బాల శశాంక మౌళి సిర ♦ వద్యకళాపరిపూర్ణమూర్తి గౌ
రీలలనార్పితార్ధసుశ ♦ రీరుఁ డనంతదయార్ద్రితోల్లస
చ్ఛీలుఁ డరాతిభీకరుఁడు ♦ శ్రీధరుఁ డాత్రిపురాంతకుండు నా
పాలిటనిల్చియుండ వెఱ ♦ వంగఁ బ నేమిటి కింకఁ జెల్పుఁడీ.

మాఱుమాటాడక వచ్చినత్రోవనే చనుఁడు (అనిలింగమును డాసి పూజాద్రవ్యములచే నర్చింపుచుండును)

2 భటు — ఓమార్కండేయ! నీయీవర్తనము ప్రస్తుతమున కనుచితము. ఇదియునుం గాక దారాసుతుల దూరీకరించి లోకులు నవ్వుదు రనియైనఁ దలంపక యొక యంగనను నెత్తిపై నెక్కించుకొని నిరంతరశ్మశానసంచారుఁడైన కొండవీటిజంగమభీరువును కౌగలించుకొనుటవలన లాభము లేదు. ఎంతశాంతముగ బలుకుచుంటిమో యూహింపుము. మమ్ము శ్రమబెట్టకుము. నీవు శ్రమబడకుము.

మార్కం: — ఓరిమూర్ఖుడా! యెంతయవివేకముగ బలికితివి! ఎవరురా నీకీయుద్యోగ మిచ్చినది? యెవనివలన సర్వప్రపంచము సృష్టింపఁబడుచున్నదో యెవనివలన బోషింపఁబడుచున్నదో యెవనివలన లయ మగుచున్నదో యెవనినామస్మరణమాత్రమున మహాపాతకములకు వెలియై సకలప్రాణులు సద్గతులఁ బొందుచున్నవో త్రికరణశుద్ధిగ సర్వసంగపరిత్యక్తులై భజించువారిహృదయపీఠములే తన యాస్థానముగానెవ్వ రధిష్ఠించిరో నిత్యానిత్యవివేచనజ్ఞానులజ్ఞానచక్షువుల కే పరాత్పరువాఙ్మృశకరణంబు లానంద మొసంగునో ప్రకృతి సర్వస్వమునందు లీలామాత్రముగ నెవఁడుగోచరించునో సర్వేశ్వరుఁ డయ్యు గుమ్మరిపురుగుపగిది నంటీయంటనివిధమున నిష్కళంకవిరాజమానమాననీయచరిత్రుఁడై యెవ్వఁడాజ్ఞామాత్రముగ జతుర్దశభువనములఁ గను పెట్టుచుండునో యట్టిజగజ్జనకుని నిందించెడిపాపి! ఇటువినుము:-

సీ. నిరుపేదవాఁడు శం ♦ కరుఁడౌనె? యైశ్వర్య
మీశ్వరాధనమై ♦ యెసఁగుచుండఁ
బిరికివాఁడెటులౌను ♦ పురదైత్యులనుబట్టి
చండాడినట్టిరు ♦ ద్రుం డతండు
జారవర్తనుఁడె ని ♦ ష్కాముఁడై మృత్యువు
నరిఁగట్టిగెలిచిన ♦ స్మరహరుండు!
ఆలుబిడ్డలఁబాసి ♦ నట్టిసన్యాసియే
యర్ధనారీశ్వరుఁ ♦ డైనవిభుఁడు.

గీ. తెలియరామి వచించితో ♦ తెలిసియుండి
చెనటివర్తనముననె భా ♦ షించి నావో!
తెలియకున్నను హరుని నిం ♦ దించిరేని
ఘోరపాతకమై కట్టి ♦ కుడుపుసుమ్ము!

మాటిమాటికి నానియమమునకు భంగమొనవించి నాకోపాగ్నికిం ధనములు గాకుఁడు. ఈశ్వరభక్తు లనసామాన్యు లనితలంపకుఁడు

1. భటు:—ఛీ! దుర్మతీ! ఇంకనుపోయెద వేమి. బలాత్కారముగ నీడ్చి కొని పో మ్మందువా? ఇప్పటి కేని లేచి వత్తువా?

మార్కం:—ఓరోరి తమోగుణప్రధానులారా!

గీ. అలరు పన్నీటికాల్వల ♦ కెలకులందు
మంచికస్తురిపాదులఁ ♦ బెంచునట్టి
యుల్లిమొక్కలదుర్గంధ ♦ ముడుగదనెడి
సామ్యమిట స్వానుభవమున ♦ సార్థమయ్యె.

1. భటు:—ఛీ? తలువా! (అని మీదికిఁ బోవును)

మార్కం:—(తొలఁగి) ఆ! పాపీ! దుర్మదాంధా! నన్నుఁ బట్ట వచ్చెదవా! (లింగముఁ గౌఁగిలించుకొని) ఓశంకరా! ఓపంచభూతములారా! సూర్యాది నవగ్రహంబులారా! నాపై దోషారోపణఁ జేయకుందురుగాక.

(అనిగుప్పెడువిభూతి వారలపై విసరును)

భటులు .1 & 2:—బాబో! నాయనో! మంటలు. మంటలు, ప్రళయాగ్ని. ఓయమధర్మరాజా! రక్షింపుము. రక్షింపుము

(అని గంతులు వేయుచు నిష్క్రమింతురు)

(తెరపడును)



(ప్రవేశము నారదుఁడు)

భజగోవిందం

ఆహా! చింతితార్థప్రదాయకుఁడగు భక్తవత్సలుని కృపాకటాక్ష మెంతకుఁజాలదు? మాయాతీతుఁడయ్యు నారాయణుఁడొకబడి యుండునట్లు నటించుట మస్తభూతి తర్పహీర్వ నలని మని చాటుఁగద! (భగవతుస్నుద్దేశించి) ఓపు [illegible] జ [illegible] న [illegible]రా! పరాత్పరా!

మ. భవపాశానలకీలలం బడి మురా ♦ సంబైన దైన్యంబుచే
నవయక లేక త్వదంఘ్రియుగ్మము సదా ♦ యాత్మస్థితిం గిల్పి వే
ఱెవరున్నారలు? నన్నుఁ బ్రోచుటకు నీ ♦ వే! నీవె! నీవే! యటుం
చెవఁడార్తిం దపియించు నాతనిమనో ♦ భీష్టంబుఁ జేకూర్పవే?

నే నింకఁ ద్వరబడి దూతలకంటె మున్నుందుగ యమునికడ కేగి ప్రసంగించెదఁ గాక.

భజగోవిందం

(నిష్క్రమించును) (ఇదివిష్కంభము)





"శ్రీరామచంద్రపరమాత్మనే నమః"

# మార్కండేయ నాటకము.

## షష్ఠాంకము

(తెరయెత్తఁగ: యముఁడు, చిత్రగుప్తుఁడు, నలుగురుభటులు, యమలోకము గనుపించును)

యము:--చిత్రగుప్తా! మదాజ్ఞానువర్తనంబున నప్రమత్తుఁడవై యుంటివా?

చిత్ర:—చిత్తము. తమశాసనంబున కడ్డుందునా?

యము:—నేఁ డెవరి నైన రావించితివా?

చిత్ర:—చిత్తము. నలువురకు శిక్షలు విధింపవలసి యున్నది. వారి నింతకుమున్నె మనభటులు గొనివచ్చిరి.

యము:—మంచిది. విచారించెదఁ బిలిపింపుము.

చిత్ర:—చిత్తము. (భటులతో) కింకరులారా! మీరు కొనివచ్చిననలువ్వురి నిటు తెండు.

భటు:—చిత్తము స్వామీ! (నిష్క్రమించి ప్రేతలతోఁ బ్రవేశించి) దేవా! వీరుగో ప్రేతలు.

యము:—చిత్రగుప్తా! వీరిచరిత్రలు వినిపింపుము.

చిత్ర:—(పుస్తకముఁ జూచుచు) వా! ఇతఁడు (అని వ్రేలితోఁ జూపుచు) నిరతాధర్మబాహ్యుఁడై లెక్కింప నలవిగాని ఘోరపాతకము

లాచరించుటయే గాక భగవంతునిం గూడఁ దిరస్కరించినపరమ కిరాతుఁడు.

యము:— (ప్రీతితో) ఓయీ! ధర్మబాహ్యమే కాక, నిరీశ్వరవాదము గూడనా? దండధరుఁ డున్నాఁ డనియైనఁ దలంపవైతివా? ఛీ! ఛీ! నాయెదుట నిలువకుము. (భటులతో) భటులారా! మీరీతనిఁ గొంపోయి ప్రథమమున సలసలగ్రాగు తైలమున ముంచుఁడు.

భటు:—చిత్తము ప్రభు! (లాగికొని పోదురు)

యము:—చిత్రగుప్తా! వీఁ డేలాటివాఁడు? (రెండవవాని నడుగును)

చిత్ర:—దేవా? వీఁడు, జన్మాంతరసుకృతమున భూసురుఁడై జన్మించి చండాలునికన్న నీచముగ సంచరించి తనవలెనే పెక్కుర కుపదేశించి నడపించినవాఁడు

యము:—ఛీ! ఛీ! గురుస్థానమునం దుండవలసినదానికి మాఱుగ నితరులఁ జెరచుటచే యమదండనలన్నియు ననుభవింపవలసినదే! (దూతలతో) ఓరీ! మీ రీలోకద్రోహిని మూత్రపురీషాదికూపమున నుంచుఁడు.

భటు:—చిత్తము. (తీసుకొని పోదురు)

చిత్ర:—దేవా! ఈమూఁడవ యతఁడు జననీజనకులను భార్యాబిడ్డలను హింసించి నిరంతరపరదారాపేక్షకుఁడై తుద కవసానకాలమున కొకమాసము క్రిందట వేయుచుండి బ్రాహ్మణుల కన్నదాన మొనర్చినవాఁడు

యము:—(మూఁడవవానితో) ఓరీ! మూఢుఁడా!

ఉ. తల్లినిఁ దండ్రి సంతతిని ♦ దారల దుఃఖములోన ముంచినీ
తల్లికి సాటివచ్చుఁ బర ♦ దారలఁ బట్టి బలాత్కరించి యా
పల్లవపాణులం జెరచు ♦ పాప మొనర్చినద్రోహచిత్త నీ
యుల్లమదెట్లు బ్రాహ్మణుల ♦ కోగిరముఁ సమకూర్ప నొప్పెరా?

ఈసత్కర్మాచరణమహాఫలంబున పూర్వమొనరించిన పాతకములు హరించు నని తలంచితివో? "పాపపుణ్యములు రెండును ననుభవింపవలసినవే" యని తెలియదా? (కింకరులతో) సేవకులారా! ఇతఁడు పరమదుర్మార్గుఁడైనను, దానములలో నెల్ల నుత్తమం బగు నన్నదాన మాచరించెఁ గానఁ బాపకృత్యములకు దగుకరపద తాడనాగ్నిస్థంభాలింగనశిక్షల నెరవేర్చి పిదప నాపుణ్యఫలమనుభవింప నుత్తమలోకంబున కంపుఁడు.

భటు:—ప్రభూ! చిత్తము. (కొంపోదురు)

చిత్ర:—దేవా! యీనాలవవాఁడు కొన్నిగ్రామముల కధిపతియై పరిపాలనధర్మము నమ్మొనరింపఁ బ్రజలలోఁ గలవరము కలిగి దుర్మార్గములు పెచ్చు పెరిగి తద్దోషఫలమున్నైత మీతనిఁ జేరుటచేఁ బాపమీరూపమున నవతరించె ననుటకు నిస్సందేహముగ నున్నది.

యము:—ఆహా! ఎంత ఘోరము? ఐశ్వర్యమదోన్మత్తత పరులసౌఖ్యముం గూడఁ బాడొనరించుఁ గద! (దూతలతో) భటులారా! మీరీతనిఁ గొంపోయి ఖరవాహనంబునఁ బట్టణం బంతయునూరేగించి రండు. పిమ్మట శిక్షించెదను.

భటు:—చిత్తము. (నెట్టుకొనిపోదురు)

యము:—చిత్రగుప్తా! ఇంకేవియేనిఁ గలవా?

చిత్ర:—ప్రస్తుత మేవియు లేవు. మార్కండేయునికొఱకంపఁబడినవారిఁకను రాలేదు. వచ్చిన మనవిఁ జేసికొందును.

యము:—మంచిది. ఋషికుమారుఁడగు నతఁడు భగవత్సేవకుఁడగుట సామోపాయంబునఁ దీసికొనిరండని దూతలతోఁ జెప్పితివా?

చిత్ర:—చిత్తము. అట్లే వచించితి.

భటు:—(ప్రవేశించి) మహాప్రభూ! నారదులవారరుదెంచుచున్నారు.

యము:—సుకృతము. తదాగమనమువలన శుభమగుఁగాక.

నార:—(ప్రవేశం) భజగోవిందం

యము:—(సింహాసనము డిగి యెదురుగాఁ బోయి) ఋషిచంద్రా!
నమస్కారము. దయచేసి యాసీన మలంకరింపుఁడు.
నార:—శుభంభవతు. శుభంభవతు. (కూర్చుండును)
యము:—దేవా! దేవరదర్శనమున ధన్యుఁడ నైతి.
ఉ. మానితవర్తనుల్! విధికి ♦ మారులుసాధుజనాగ్రగణ్యులుఁ
గానకళాప్రపూర్ణులు జ ♦ గత్రియవంద్యులు ధర్మమార్గసం
ధాను లుదారమానసులు ♦ ధారుణిపైఁ గలవార్తలెవ్వియో
వీనులవిందొనర్చి శ్రమ ♦ బెట్టుట నెమ్మది నుంచఁ బోకుఁడీ.
నార:—యమధర్మరాజా! నేను లోకత్రయసంచారి నగుటచే, నా
కెఱుఁగరానివిషయ ముండ దని నెల్లరిట్లోరుచుండుటయు
సమయమునుఁ బట్టికోర కున్నను నేనే తెలియఁజేయుచుండుటయు
సహజమై యుండ నీవు శ్రమఁ బెట్టుటేమున్నది? ఇప్పుడు నేనొక
కార్యార్థినై వచ్చితిని. నీ వది మన్నింతు వని నమ్ముచున్నాను. పర
మధర్మము. మహోపకారము.
యము:—మహానుభావా! అది యేదియో సెలవిండు.
నార:—సావధానుఁడవై యాలింపుము. భూలోకంబునమృకండమరు
ద్వతు లనుమునిదంపతులకు పదియాఱువత్సరము లాయుఃప్రమా
ణము గలకుమారుఁ డుదయించి యుండుటయు నేటితో గడువు తీరు
ననుటయు నీ వెఱింగినవిషయమే కద! అందుచే నాకుమారునికై
విలపించువృద్ధదంపతులఁ గాంచి జాలిఁ జెందినవాఁడ నగుట నీ వా
తనిజోలికిఁ బోవల దని నిన్నర్థించి సంకల్పసిద్ధి వడయుటకై నీ
యాస్థానమున కేతెంచితి. సకలధర్మపరిజ్ఞానముఁగలిగి "సమవర్తి"
యని పిలువంబడునీవు కలహాభోజనుఁడ నైనను బ్రిస్తుతమునం
దుపవాసమున కోర్చి పల్కెడునాపల్కులపై విశ్వాస ముంచి యే
కపుత్రవిషయ మాలోచించి రాక రాక వచ్చిననా యాగమనముఁ
దలంచి మదభీష్టముఁ జెల్లింపుము. సకలజగములందు నిరుపమానకీ

ర్తి నార్జింపుము. ఎవరినిఁ గాని దేనిని గాని యెన్నఁ డర్థించి యెఱుఁగను. నీకుఁ దెలియని దెద్దియును లేదు. దూరమాలోచింపుము.

యము:—తాపసోత్తమా! యీలాటితల్లిదండ్రులు, కుమారులుఁ బ్రపంచమున నెందరో కలరు! అట్టిమొక వీరివిషయమున జాలిఁ దలంచితి నేని యిల్లే యెంద రర్థింతురో! వారి నాదరింపకున్న నెంతగ దూషింతురో! భయభక్తు లెంతగ నశించునో లోకు లెంతనిందింతురో తమచిత్తమునఁ దలంపుఁడు. మఱియు,

చ. గురుకరుణాలవాల ననుఁ ♦ గోరఁగఁ జెల్లునటయ్య? యింతదు
ర్భర మగుకోర్కె నాపయి నె ♦ పం బిడఁబోకుఁడు ధర్మశాస్త్రవి
ద్వరులు హసించి దుర్గుణుఁడి ♦ తం డని నింద యొనర్పకుందురే?
నరకము సంఘటిల్లదె? చ ♦ నం దగదే? సమవర్తనంబునన్

నన్ను మన్నింపుఁడు. నాదూతల నీవలఁకే పుచ్చితి.

నార:—యముఁడా! యీమాత్రము నాకోరికఁ జెల్లింపలేకపోయితివి. చెప్పవలసి చెప్పితిఁ గాని శంకరుఁ డాకుమారున కీవలఁకే చిరాయుర్దాయ మొసఁగి తనసేవ జేయించుకొనుచుండె. నీకు వృథాశ్రమయగుఁ గదా యని యూహించినందులకు నిష్ఫల మయ్యె. పోయినీదూతలు నేతు లాడించుకొనుచుఁ దిరుగ రావలసినదే కాని ప్రయోజన మేమియు లేదు. నీమర్యాదను గాపాడుకొనుము.

యము:—ఆ! నారదా! నాకింకరులరుగుట నిష్ప్రయోజనమా? శంకరుఁడు చిరాయువొసంగెనా! నామర్యాదఁ గాపాడుకొనవలయునా? నాకు వృథాశ్రమకలుగునా? యేమి యీవింత! యింతవిపరీత మెందైనఁ గలదా?

ఉ. ఏల పదాఱువత్సరము ♦ లే యని బాలు నొసంగువేళఁ దాఁ
గాలమునిర్ణయించె? కఱ ♦ కంఠుఁడు నేఁడుచిరాయువిచ్చి యీ
లీల నధర్మవృత్తిని మ ♦ లీమస మూని చరింప నౌనె? యీ
కాలునిఁ జిన్నబుచ్చుటకు ♦ గాఁ దలపెట్టెనె? యింత ఘోరమే!

నిరంకుశప్రతాపుఁడనై సమస్తలోకభీకరుఁడనై "సమవర్తి" యని ప్రఖ్యాతివడసిన నేను, దుష్టశిక్షణంబొనరించెడునేను తలఁచుకొనినం తనె గుండెలు వ్రీలునట్టిభయంకరచరిత్రుఁడ నగునేను, వదాన్యశిఖామణి యనియు మానధనుఁ డనియుఁ గొనియాడంబడునేను, నేటికీకారణమునం గలుగు పరాభవమున కిచ్చగింతునా? దండధరుఁడు న్యర్థుఁడని లోకము నిందింపదా? నిందమాట యెట్లున్నను ధర్మబాహ్యమున కనుమతింతునా? కావున శంకరుఁ డాతని కెట్లు చిరాయువొసంగెనో అసత్యమున కెట్లు పాల్పడెనో కనుఁగొనవలయు. నిటలాక్షుఁ డధర్మవర్తనుఁ డయ్యె నని సమస్తప్రపంచము తనను మాత్రము దూరీకరింపదా? యియ్యది నీతియా?

౩౩-అష్టబంధము

నార:—శాంతించవోయి యముఁడా! శాంతించు. ఏలత్వరపడియెదవు? పాపపుణ్యవిచారణకై నియమింపఁబడిననీవు భువనైకశాసనుండును సకలలోకారాధ్యుఁడును నగు శంకరుఁ దృణీకరించి "నీతియా" యని ప్రశ్నించుచుంటివా? అబ్బా! యెంతసాహసికుఁడవైతివి! పదవికి మించినకీవి సదమదించునుసుమా! భక్తపరతంత్రుఁడగును మావరుఁడు విశ్వామిత్రవసిష్ఠులచేతను నావలనను బ్రార్థింపఁబడి మార్కండేయునిభక్తికి సంతసించి చిరకాలజీవి యగునట్లు వరంబొసఁగె. అయినను న్యాయ మనుసరించి నీకీవార్త నెఱిగింప నీవే ధర్మపథగామివైన ట్లుపన్యసించు చుంటివి. ఇప్పటికేని తీవ్రమడఁచుకొని యోజింపుము. నీ కియ్యది పరాభవకారణము కాదు. ధర్మబాహ్యము గాదు. మార్కండేయుఁ డపరశంకరావతారుఁడైనట్లు పొడకట్టుచున్నయది. చెప్పవలసినది చెప్పితి. నీవణుమాత్రము సంశయింపక నాయుపదేశ మంగీకరించి సుఖింపుము. నీవిభీషకలకు రుద్రుఁ డూరకొనఁడు. నీ కపాయము వాటిల్లక మానదు. మార్కండేయుని నీవేమియుఁ జేయఁ జాలవు. విడువ నీయిష్టము.

యము:—ఏమి? నా కపాయము వాటిల్లునా? మీరందఱు నేకీభవించి యీ యకార్యమున కొడిఁగట్టితిరా? మంచిది. మీమీపట్టుదలలు, మార్కండేయునిచిరాయుష్యము, శంకర వాగ్దాన మే పాటికొనసాగునో చూచెదఁ గాక. ఔరా! యెంత ఘోరవిపర్యాసము! యెంతనీతిమాలినవర్తనము! ఇంతటిదుర్మార్గమునకే సమ్మతింతునా? యేమైన నగుఁ గాక నేనుపేక్షింపను. (చిత్రగుప్తునితో) చిత్రగుప్తా! మార్కండేయునికొఱకు మఱియిద్దఱఁ బంపుము.

చిత్ర:—చిత్తము.

(తెరలో) యమధర్మరాజా! రక్షింపుము. రక్షింపుము.

యము:—(వినుట నటించి) ఏమిది? ఆర్తరవము వినవచ్చుచున్నది (సాభిప్రాయముగఁ దల యూఁచి) ఓహో! బాధకు సహింపలేని మార్కండేయుఁడు రక్షింపుమని మొఱసేయుచుండెఁ గాఁబోలు. నారదా! వింటివా? కనియెదవు గాక.

నార.—క్షణకాల మోపిక సేయుము. ఎవ రేది విందురో కందురో తేలఁగలదు.

(మార్కండేయునికొఱ కేఁగినభటులు ప్రవేశించి)

భటులు1 &2:—మహాప్రభూ! రక్షింపుము. రక్షింపుము.

యము:—ఏమిరా? మీ కేయపాయము వాటిల్లె?

భటు. దేవరా! తమ యాజ్ఞగా మార్కండేయున కెఱఁగించి రమ్మన నేమేమో దూషించి మమ్ములెక్కపెట్టక పట్టెడు విభూతి మంత్రించి మాపై విసరె. నంత నది మాశరీరములపై నిప్పులవానపగిది మంటలఁ గలిగించి మూర్ఛాగతులఁ జేసె. పిమ్మటఁ గొంత సేపటికెటులో తెలవి నొంది చావుఁ దప్పి కన్నులొట్ట పోయినవారివలె నిటువచ్చితిమి. క్షమింపుఁడు.

యము:—(మహాకోపమున) ఔరా! యెంతకండకావ్రు? (మార్కం

కమును జూచుట నటించి) ఆహా! యేమిది? సర్వాంగకములు న
శంకుచున్నవి! నయనాంతర్గళితము లగునీబాష్పము లానందసూచ
కములా? సంతాపసూచకములా? (భగవంతు నుద్దేశించి) ఓపురా
ణపురుషా! నాగభూషా!

అనుబంధము—35

(కన్నులందెరవకయే) ఓహో! యేమి యీపశ్రకాశము? యేమి యీ
ధగద్ధగితము? యెవ్వరి దీసవ్యహస్తము? ఓహో! వ్యాఘ్రాజినపరిశో
భితకటిపదేశము! ఫణిహారాలంకృతవిశాలవక్షము! జటాజూటాంత
రోల్లసితబాలగంగాలహరీపసన్నము. నిరుపమానందసంధానపవిత్ర
భస్మలేపనాత్యంతసుందరశరీరము. భక్తరక్షణకళాప్రపూర్ణభాసుర
దృగంచలము. ఆహా! యేమి నాభాగ్యము! ఏమి నాయానంద
ము! ఏమి నాసుకృతపరిపాకము! తండ్రీ! సకలలోకసంత్రాణశీలా!
యేమి నీమందహాసము? జడియకుము, వరదాభయహస్తముఁ జూ
పుచుంటివా? జగజ్జనకా! నీ కేపూజోపహారముల నొసంగుదు? భ
క్తమానసమందిరుఁడ వగునీవెలుఁగనిది కలదా? యిదే నాప్రాణ
మానసభక్తినిధానములు నీచరణకమలముల కర్పించితి. నీయిచ్చవ
చ్చినదానిఁ గైకొమ్ము. (అని కొంచె మాగి) జనకా! ఏమిసెల వి
చ్చుచుంటివి? (కొంచె మాగి) ఓహో! భక్తజనమనఃకుసుమమే నీ
కువలయునా? సంతోషము. నమస్తే! నమస్తే! నమస్తే! (కనులు
విచ్చి సధైర్యముగ)

శా. అక్షయ్యం బగుచి త్తవృత్తిని సమ ♦ స్తాంతర్బహిస్సంగతుం
దక్షధ్వంసకు, ఫాలలోచనుపద ♦ ద్వంద్వంబు సేవించి ప్ర
త్యక్షప్రాభవదీపితామలకళా ♦ ప్రావీణ్యశోభామనో
దక్షత్వంబు వహించినాఁడ నిఁక సం ♦ తాపంబు లే దెందునన్.

ఓహో! యియ్యది యహంకారవ్యక్తిస్ఫురణకారణం బగు నేమో?

యీశ్వరసాక్షాత్కారానంతరమున ద్విగుణీకృతసత్వగుణాలంకార
ము గదా! జన్మకుఁ బరమావధి. అందుచే గర్వింపఁ జనదు. శ్యామా
మనోవల్లభుఁ డేతెంచిన సాధ్యమగునంతవఱకు సామవాక్యములతోఁ
బ్రసన్నుఁ గావింపఁ బ్రయత్నింపవలయు. యముం డందుల కస్య
థావర్తించు నేని నాపాలి పరమేశ్వరుఁడే కలఁడు. (లింగము డాసి) ఓ
కృపాసింధు! దీనబంధు! నాచిత్తమును నీచమార్గములఁ బోనీకుము
(ధ్యానము నటించును.)

(తెరలో) రే! బ్రహ్మకులభారభూతా! మార్కండేయా!

శా. ఓరీ! దుర్మద! దుర్విచార! చెనఁటీ ♦ యో రోరీ పాపిష్టి! యూ
రౌరా క్రూర! మదీయకింకరుల కీ ♦ వావంత యుఁ జంక క
న్వారిన్ బాధలఁ బెట్టినా వటర? ఛీ ♦ భర్త్సింతు కాలింతు నీ
వీరత్వంబును మంటఁ గల్పు నని భా ♦ వింపంగ లేదే? ఖలా!

మార్కం:—(కరములు జోడించి)

గీ. శ్రీమహేశ్వర! యభవ! యు ♦ మామహేశ నోజ!
భక్తవత్సల! శంకరా! ♦ పరమపురుష!
ఫాలనేత్ర! ప్రశస్త! క ♦ పాల హస్త!
శరణు ఫణిహార! రజత భూ ♦ ధరవిహార!

యము—ఓరీ! మూర్ఖా! పరేతరా ట్టనుభయ మించుకయు లేక క
న్నెత్తి యైనఁ జూడక వాపోయెద వేమిరా? పాపాత్మా!

మార్కం:—(చూచి నిలచి) అయ్యా! నేను పాపుఁడ నగుటం జేసియే
పవిత్రతకొఱకీశ్వరు ధ్యానించు చుంటి.

యము—ఛీ! ఛీ! వదరుఁబోతా! నిఖిలభూతశాసకుఁడ నగునాయాజ్ఞ
నుల్లంఘించి నాదూతల నేలఁ దిరస్కరించితివి? యీశ్వరు సేవించు
చుంటిఁ గదా యని మదించి స్వేచ్ఛాసంచారుఁ డవైతివా? లేక

శంకరుఁ డనీతిమార్గవర్తన ముపదేశించెనా? నీ కిప్పు డెవఁ డడ్డము వచ్చునో కనుఁగొనియెద. (అని నెట్టబోవ)

మార్కం:—ఓయమధర్మరాజా! శాంతింపుము. నన్నెన్నియైన దూషింపుము. జగదేకజనకుఁ డగుశంభుని దూరకుము. అదిమహాపాపము గద. ధర్మస్వరూపుఁడ వగునీవు కించిజ్ఞుఁడ నగునాచేఁ జెప్పించుకొన వలయునా? మహాత్ముఁడవు! తరతమభావవేత్తవు! సకలసద్గుణగరిష్ఠుడవు! సామాన్యుఁడవు గావే! నీఁ కెఱుకరాని యంశ ముండునా? నీమాతలఁ దిరస్కరించునంతటిసమర్థత నాకుఁ గలదో లేదో నీవే యోజింపుము. సర్వము సర్వేశ్వరుమాయ గాక యితర మగునా? దీర్ఘదర్శి వగునీవు! న్యాయశీలుఁడ వగునీవు! జ్ఞానమూర్తి వగునీవు! భవత్తాలవితుఁడును సకలభూతసుఖాసుఖదప్రభావుఁడును నగు మహాదేవుని నిందింపకుము. నామనంబును గుర్తింపనలె నన్న వే ఱొకమార్గమునఁ బరీక్షింపుము.

యము— ఛీ! ఛీ! మాయ మింక నీనోరు. నిన్ను విడువను అధర్మమున కిచ్చగింపను. పట్టినపట్టు మానను.

మార్కం—ఓసమవర్తీ! యధర్మ మించుకయు గాదు. దూర మాలోచింపుము. నీదర్శనభాగ్యమున ధన్యుఁడ నగుదు నని యువ్విళ్ళూరుచున్ననాహృదయమును గమనింపక కేవలము నిందితునిగా నూహింప నగునా? మహాత్ముల యోగమనము పరమహర్షానుసంధానమనివచింతురే? నాయందు దయఁ దలంచి జరాభారపీడితు లగునా తల్లిదండ్రులగోల విచారించి మన్నించి రక్షింపుము.

యము:—నీయామాటలు నాకడ సాగిరావు. కల్లబొల్లిచమత్కారముల కుబ్బి తబ్బిబ్బు లగువాఁడ గాను. సర్వేశ్వరుఁ డొసంగిన పదియాఱువత్సరములగడువు పూర్తియైనది. భగవదాజ్ఞకు వ్యతిరేక ముం

డదు. నీవు బాలుఁడవు నేను కాలుఁడను. నీ కింకను భయము లేన
ట్లున్నదే? జాలియనునది నా కేకోశమందును లేదుసుమా!

మార్కం:—ఓ! యమునాగ్రజా! యెంతవేడికొనినను నీ కావంతయుఁ
గరుణ రా దయ్యెనే? ఇంతనిర్దాక్షిణ్యము తగునా? వసంతసమయ
పల్లవితనికుంజపుంజములచే నలరారు మావిగుబ్బపై విచ్చలవిడి
విహరించెడుకలరవము ముండ్లడొంకలఁ దిరుగ సమ్మతించునా?

యము:—ఔరా! క్రూరా! యే మంటివి? నా యాస్థానము ముండ్ల
డొంకకు సమానమును నీవు పికప్రతిమానుఁడవునా? యెంతకావర
ము! నీయిప్పటివర్తనమే చెప్పుచుండ నాపరోక్షమున నస్మత్కింక
రులఁ దూలనాడు టబ్బురమా?

శా. ఔరా! దుర్విషయప్రచారుఁడ! త్రాణ ♦ ప్రాయుండ వీవెంత నీ
బీరం బెంత? యముం డనంగ సకలో ♦ ర్వీచక్ర మ్మల్లాడఁగాఁ
గ్రూరా! నన్నుఁ దృణీకరించెదవె? కొం ♦ కున్ జంకు లేకుండ! నీ
ధీరత్వం బదియెంతొ! చూచెదను మ ♦ ద్వీరప్రతాపంబునన్॥

మార్కం:—(లింగము డాసి పత్రిచేఁ బూజించుచుండును.)

యము:—ఓరీ! మదాంధీభూతచేతస్కుఁడా! అస్మత్కోపానలంబున
నిదే భస్మ మగుదువుసుమా! నీనిర్లక్ష్యభావము మఱింతరవుల్కొచు
న్నయది. ద్రోహీ!

మార్కం:—(స్వ) ఇఁక నీతనిఁ బ్రతిమాలినలాభము లేదు (ప్ర)
ఓయీ! మందమతీ! నిర్లక్ష్యము గా కేమి? వినుము.

మ. హరుఁ డార్తావనదీక్షితుండు దన ♦ వాఁ డైయుండ నెవ్వానికిన్
వెర వేరీతిజనించు? నీవెఱుఁగవే ♦ నిన్ విన్మ నామాట! శం
కరపాదాబ్జవిహారభృంగ మగుమా ♦ ర్కండేయుఁ గొంపోవ నీ
తరమా? యేల? వృథా శ్రమంబు? చనుమా! ♦ తర్కింపకుండన్ వెసన్

యము:—ఔరా! దుర్మదా! యెంతనిష్కంపముగా వదరుచుంటివి? నిన్నుఁ గొంపోఁ జాలనుగా?

అనుబంధము—36

మార్కం:—ఓయీ! కాలుఁడా! యేలప్రగల్భము లాడెదవు? సకలశాత్రవారణ్యకుఠారుఁ డగుత్రిపురాంతకు భజించెడునాకు నిష్కంపముగా కేమి?

మ. సకలోర్వీతలజంతుసంతతమన ♦ స్సంక్షోభ ఘోరాయుధ
ప్రకరాడంబరదీర్ఘదంష్ట్రిచటులో ♦ గ్రధ్వానముల్ గాంచి మా
మకచిత్తస్థితి కంప మొంద దదని ♦ ర్మాల్యంబు పో మ్మింక పా
తకులన్ శిక్ష లొనర్ప శైవమతభ ♦ క్తశ్రేణిపై బోకుమా!॥

అటుగాక యనిమిత్తముగఁ జెలరేఁగితి వేని భక్తసంరక్షకుఁడగురుద్రుఁ డూరకొనఁడు. నన్ను దూషించుట నాయిష్టదైవమును దూషించుటయేయగును. నాయంతరాత్మ శివునియందు లగ్నమై యుండుటయే యందుకు కారణము నీవును శంకరున కొకకింకరుఁడ వగుటఁ బ్రభుతిరస్కారమహాపాతకమునం బడుదువు. స్వామిద్రోహి యగువాఁడు తనపదవినే గాకప్రాణములపై తముఁ గోలుపోవలసి వచ్చును. శివదూషణమహాపాతకఫలం బింత యనివచింపుట కశక్యము. దేవదేవునినిందించుట నిన్ను బంధింపఁ దగినపరికరముల నీవే సిద్ధపఱచుకొనుటగాఁ దలంపుము. భగవంతునిదూషించినవా రెంద రధోగతులం బడిరో స్మరింపుము. భవదున్మత్తప్రలాపోద్భూతదుస్సహక్రోధానలంబున రుద్రుఁడు నీగర్వభంగ మొనరింప దుముకులాడుచుండె నని నమ్ముము. కమలసంభవాదు లడ్డపడినను నిటలాక్షుని వారింపఁ జాలరు. త్వదుత్తమాంగ మాత్రిశూలధార కెరఁ జేయక

వినుమా. నీదూత లీనటి కొనర్చిన నిందలకును ఇప్పటినీపరుష వాగ్విజృంభణమునకును గలిగిన పాపకూపమునుండి బయల్పడ నెంతు వేని శంకరపాదారవిందముల డెందమున నిలిపి ధ్యానించి జ్ఞాననేత్రమున నొక్కమా ఆయుర్లేఖరు దిలకించి కరములు మోడ్చి నమస్కరింపుము. అటు కాదా! కానున్నది కాకమానదు. నే నిం కేమియు జెప్పజాలను. పిదప నీయిష్టము.

యము:—రే! కలుషా! నీవు సాధ్యము కావుగా? చూచెదఁ గాక! కమలసంభవాది ప్రముఖులకును వారింప శక్యముగాని మహారౌ ద్రమున నుప్పొసగుచుఁ ద్రిశూలధారి యగురుద్రుఁడు నన్ను దండిం పవచ్చుచుండెనా? యింతటి యధర్మమున కొడిగట్టినవాని త్రి శూలమా? మదుత్తమాంగము స్పృశించునది? పాపీ! దుర్మదోద్రే కమునఁ గన్నుఁగానక మిట్టిపడెదవా? చండప్రచండమండితాఖండ లుం డగుదండధరుండు, నీచే దూషింపఁబడెడువాఁడా? క్రూరా!

మ. చటులప్రౌఢిగదోగ్రఘట్టనలచేఁ ♦ జండాడుచు న్నిన్ను మ
 ద్భటసంఘంబులు కాలరాయు నపు డ ♦ బ్బా తాళలేనంచు సం
 కటముల్ బొందెదువేళ యయ్యొ, నిటనీ ♦ గర్వోక్తులన్ గట్టి మ
 చ్చటఁజూపింపగ వచ్చునీకుఁ గలభీ ♦ చాతుర్యముల్ దుర్మతీ!

ఈక్షణమాత్రా శేషలోక మనస్సంతాపహేతుభూతం బగుకాల పాశానలంబున ని న్నిప్పుడే నాశన మొనరించెద జూడుము (అని పాశమునుఁ దీయఁ బ్రయత్నించును.)

మార్కం—ఓయీ! కాలుఁడా! వదరకుము. సకలజగద్భీకరదుస్తరని రుపమానవిస్ఫులింకశిఖాసంకలితఫాలనేత్రాగ్నిజ్వాలకన్న నీపాశా నలజ్వాల గొప్పది యగునా? వినుము.

యము:—ఔరా! దుర్మదా! యెంతనిష్కంపముగా వదరుచుంటివి? నిన్నుఁ గొంపోఁ జాలనుగా?

అనుబంధము—36

మార్కం:—ఓయీ! కాలుఁడా! యేలప్రగల్భము లాడెదవు? సకలశాత్రవారణ్యకుఠారుఁ డగుత్రిపురాంతకు భజించెడునాకు నిష్కంపముగా కేమి?

మ. సకలోర్వీతలజంతుసంతతమన ♦ స్సంక్షోభ ఘోరాయుధ
ప్రకరాడంబరదీర్ఘదంష్ట్రచటులో ♦ గ్రధ్వానముల్ గాంచి మా
మకచిత్తస్థితి కంప మొంద దదిని ♦ ర్మాల్యంబు పో మ్మింక పా
తకులన్ శిక్ష లొనర్ప శైవమతభ ♦ క్తశ్రేణిపై బోకుమా!॥

మిత్తముగఁ జెలరేఁగితి వేని భక్తసంరక్షకుఁడగురుద్రుఁ
షు. నన్ను దూషించుట నాయిష్టదైవమును దూషించు
యంతరాత్మ శివునియందు లగ్నమై యుండుట
ము నీవును శంకరున కొకకింకరుఁడ వగుటఁ
తకమునం బడుదువు. స్వామిద్రోహి యగు
కప్రాణములపై తముఁ గోలుపోవలసి వచ్చు
పాతకఫలం బింత యనివచింపుట కశక్యము.
నిన్ను బంధింపఁ దగినపరికరముల నీవే సిద్ధపఱ
పుము. భగవంతునిదూషించినవా రెంద రధో
ంపుము. భవదుస్మత్తప్రలాపోద్భూతదుస్సహా
దుద్రేకు నీగర్వభంగ మొనరింప దుముకులాడు
ము. కమలసంభవాదు లడ్డపడినను నిటలాక్షుని
త్వదుత్తమాంగ మాత్రిశూలధారకెరఁ జేయక

సీ॥ కహకహధ్వాన భీ ♦ కరశిఖావృతిసుప
ర్వసహతి క్రొక్కింత ♦ సైపనచ్చు
ప్రళయకాలోద్భూత ♦ భయదహుతాశన
జ్వాలల క్రొకవేళ ♦ దాఁకనచ్చు
స్మరణమాత్రాశేష ♦ జంతుసంతాపహే
తుకబడబాగ్నిలో ♦ దుముకనచ్చు
సంప్రాప్తకరాళ్ళ న ♦ క్త్రిభయానకముసహ
రించుమృత్యువునెది ♦ రింపనచ్చు
గీ. గాని దుర్వారదుర్భరా ♦ ఖండధూమ
పటలచటులజ్వాలారుణప్రభా ♦ భాసమాన
ముష్ణితీక్ష్ణప్రతాపబం ♦ ధురదురంత
ఫాలనేత్రాగ్నికీలల లో ♦ నోర్వంగ దరమె॥

కావున నీపాశముపేరుఁదలంపక వచ్చినత్రోవనం జని సుఖింపుము. (అని లింగముం జేరి) నమస్తే! శివా!

యము:—మూఢా! నశించితివి (అని పాశము మెడ వేయును.)

మార్కం:— (అనుబంధము 37) (లింగమును కౌఁగలించి)

(లింగాకారము గొప్పధ్వనితో బద్దలై, శంకరుఁడు ప్రసన్నుఁడై మార్కండేయునితలపై నొకహస్త ముంచి రెండవకరమునఁ ద్రిశూలము యమునిశిరంబునకు గుఱిఁజేసి)

శంక:—రే! కలుషా! యమా! భక్తజనావనుం డగురుద్రుఁ డుండె ననియైనఁ దలంపక యీసుమారు హింసింప వచ్చితివిరా? ద్రోహీ! యిదే మదీయత్రిశూలంబునకు హత మగుచున్నాఁడవు. (అని పొడువఁబోవ)

నార:—(ప్రవేశించి) ఈశ్వరా! క్షమించి శాంతింపుము. యముఁడా! తొలఁగుము.

శంక:—నారదా! దుర్మార్గము సహింప నగునా?

నార:—దేవా! నీవే మన్నింపకున్న నీకాలుఁడంత మొందఁడా? పాపుల దండింప దండధరుం డున్నాఁడనుభయమే లేకున్న లోకంబుల దుర్మార్గంబులు మితి మీరి కల్లోలములై పోవా? సర్వాంతర్యామివై న నీ వెఱుఁగవా? (యమునితో) యముఁడా! ఇంకను మూర్ఖుని పగిది నిలచుండెదవేల? నారదోపదేశతిరస్కారఫల మనుభవింపక తప్పునా? క్షమింపు మని వేఁడుము.

యము:—(తనలో) ఔరా! ఈనారదుఁ డెంతవాఁడు! ఇప్పుడుశరణనక తప్పునా? అయినను భగవంతునిఁ గద వేఁడుట (ప్రకాశముగా) మహాదేవా! క్షమించి నావిన్నప మాలింపుము. దుష్టశిక్షణము మాత్రమే గాక జీవానిలగ్రహణమునకు సైతము నన్నే నియోగించినవాఁడవయ్యు నిష్కారణముగ దండింప వచ్చుట ధర్మమా?

శంక:—(శాంతించి)యముఁడా! శరణార్థివై నందునఁ గరుణించితి. ఇఁక నీబాలకుఁడు యోగశాస్త్రానుసరణ నిశ్చలతపః ప్రభావంబునను నిరూఢభక్తితత్పరత్వమునను నన్నుజయించి చిరాయువు నార్జించె; నిజభక్తాభీష్టప్రదానమె నాకర్తవ్యము. మనోబుద్ధిచిత్తాహంకారములఁ ద్యజియించిన నాభక్తు లందరానికోరిక లెందును లేవు. నీ విం నిజనివాసంబున కేఁగుము.

యము:—చిత్తము. నీయీగంభీరాభిప్రాయ మెఱుంగ నైతి. మన్నింపుము (అని నమస్కరించిమార్కండేయునితో) ఓభక్తాగ్రేసరా! మార్కండేయా! నీ వింతవాఁడ వని యిప్పుడుగ్రహించితి. చతుర్దశభు

వనైకపరిపాలనదక్షుఁ డగుశంకరుని యెట్టయెదు
ముకోలఁది నాకొసఁగువరముల స్వీకరింపుము.

(అనుబంధము.—38)

మార్కం:—అజ్ఞానవశమున నిన్నేమైన దూలనాఁ
పుము.

యము:—సంతోషము పరాత్పరా! శంకరా! సెల
నినిష్క్రమించును)

నార:—(స్వ) ఈమాత్రిపుగర్వభంగము గాకున్న నీ
మా? కాలున కొక్కనికే కాదు; తన యంతటివా
చి క్రిందు మీా దెఱుంగక మిట్టిపడుపత్రివానికిని
గభంగముఁ గావించుచుండిన గాని తలపొ కె :
ఇప్పటికి నాకడుపు నిండినది. (తేపును.) మృక
త్యానందభరితు లగుదురు.

(మృకండమరుద్వతుల ప్రవేశము.)

మృకం:—పరాత్పరా! గిరిజావరా! నమస్తే! శంకరా!
నారదా! నీకృపావిశేషమున కెంతయుఁ గృతజ్ఞులః

నార:—ఈశ్వరవిలాసము.

. శంక:—మృకండమరుద్వతులారా! వీడుగో! మీాబిడ్డఁ
రకాలజీవియై భవిష్యద్ధర్మశాస్త్రరచనాసమర్థుఁడై న
కెక్కఁగలఁడు. ఇంక నేమేని వలసినఁ గోరికొనుఁడు

మృకం:—తండ్రి! నిఖిలలోకశరణ్యా!

మ. చిరజీవిత్వ మొసంగి నాకొమరునిన్ ♦ జేపట్టి రక్షిం
వరయన్ గోర్కె లిఁకేమి కల్గు? భవదీ ♦ యంబై

ర్పరుపన్ గోరుచు నుంటి! వ్యథలను మా ♦ పైఁ జూపవే నీకృపన్
దురితౌఘంబులఁ బాపి లోకముల సం ♦ తోషంబునన్ మన్పవే!॥

శంక:—మీరు నాయెడలఁ గలభక్తితాత్పర్యములు కలవా రగుటచేఁ గాల మాసన్న మైనపుడు పుణ్యలోక మలంకరింతురు. ఇప్పటికి మీతనయునితో పురమున కేగుఁడు.

మృకం:—పరమేశ్వరాజ్ఞ శిరసా వహించితి.

శంక:—మార్కండేయా! నీ కేమైన వరములు గావలెనా?

మార్కం:—రక్షకా! నీదర్శనభాగ్యముకంటె నే నేమి కావలయు? అయిన నిట్లుకూడఁ బ్రసాదింపుము.

గీ. భక్తజనవదనాబ్జసా ♦ న్నిధ్య కరణి!
తావకీనానురాగసం ♦ ధానకరణి!
జీవకోటుల కెల్లసం ♦ జీవ కరణి!
యైననీకృప జగములం ♦ దలరుఁ గాక!॥

శంక:—తథాస్తు! నీతల్లిదండ్రులఁ జేరుము.

మార్కం:—జననీజనకులారా! వందనము. (నారదునితో) నారదమునీంద్రా! నమస్కారము.

నార:—చిరంజీవిన్! కల్యాణం భవతు.

మృకం, మరు:—తండ్రీ! రమ్మా (దగ్గఱకుం దీసుకొందురు).

(అనుబంధము—౩౭.)

(పుష్పవృష్టి కురియును. తెరపడును.)

ఇతిశ్రీమదాంజనేయచరణారవిందసేవాసక్తచిత్తపింగళి వెంకటనర్సయామాత్యవిరచితమార్కండేయ నాటకమునందు, సర్వము శ్రీరామార్పణము. శ్రీ. శ్రీ. శ్రీ.





## అనుబంధము. 1.

హిం-కాఫీ-ఆదితాళం.

ఋషులు:—1వ పుట.

జయ! జయ! కమలాసన! భవతరణా! జయ! వాణీశ్వర! సద్గుణ సదనా! ॥జయ॥ జయసృష్టిస్థితిలయకారణ! శిష్టజనావన! సన్మునిపూజిత పద॥జయ॥ అరయ సకలభువనమ్ముల ద్వన్నామ్నాయానిబద్ధములఁ గావించి యునాటలాడించెదవు కళాపరిపూర్ణత! నమలపదవిహార రామరసేవిత జయ॥జయ॥ సకలము నీ వని సమ్మిన ముముక్షుసంతతికిన్ బ్రహ్మానంద మె కద? వికలచిత్తులును సకళంకులు దావకసత్యంబు నెఱుంగఁ గలారే? జయ॥ జయ॥

## అనుబంధము. 2.

రూపకము-నాదనామకిరియ.

మృకండుఁడు:—3వ పుట.

హా! విధీ! యిటుల లిఖించితే? నాయలికమున॥హా॥ ఈవిపరీతముగలుగు

నను చు నాభావమునన్ దలపోయ నైతిగా ... ... ॥హా॥

పావన మగునీదర్శనభాగ్యమైనఁ గలుగక నాపాపమిటులఁ బండెనా?

పరమపురుష! పద్మగర్భ॥హా॥

## అనుబంధము. 3.

ఏకతాళం-కళ్యాణి.

మృకండుఁడు:—3వ పుట.

జగదీశా! యీశా! అ అ... ... ... ॥జ॥

నిగమాంతవేద్యా! నీపదాబ్జములఁ దగభజింతు నార్తజనశరణ్యా! మృ
గధరా! పన్నగధరా! సుగుణాకరా! సంస్తుతింతుఁ బురహర! ॥జగ॥

అనుబంధము. 4.

ఆది-బ్యాగ్.

మరుద్వతి:—5వ పుట.

సుదినమూ! సుదినమూ! సుదతులార! మీరలు మాయాశ్రమపథము
నందుబదము లిడుటఁ నెమ్మది ముదం బయ్యె గడుంగడున్ ॥సుది॥
ఆడఁబోవుతీర్థము తనకే యెదురైనభాతి సఫల మయ్యెఁ గోరిక...
సుదినమూ॥

అనుబంధము. 5.

రూపకము-హిం-కన్నడ.

మరుద్వతి 6వ పుట.

ఎంతపాపకాల మాయెనో?నా... ... ... ॥కెంతపాప॥
సంతులేని, జన్మమేల? జగతీస్థలిన్ నా॥కెం॥ ఇంతఘోర మొదవు
ననుచు, నెఱుఁగ నైతి నా కెంత నీచమా? ... ॥ఎంతపాప॥

అనుబంధము. 6.

జంఝూటి-ఆది

మరుద్వతి:—7వ పుట.

సాధ్య మగునే? యెవ్వరికిన్! పరమేశులీలలనుఁ దెలసి మెలగఁ గాఁ ॥సా॥
సకలచరాచరజంతుసంతతుల జననస్థితిలయకర్మకారణుఁడు॥సా॥
సంతోష మొదవించు సంకటముఁ గలిగించు నంతదానై యుండు
ననలే లేనటులుండు॥సా॥
ఎప్పటి కెవ్వరి కేది ఘటించునో? తప్పనే యది? ధాతకు నైనన్॥
సాధ్య మగునే?॥

అనుబంధము. 7.

రూపకము—నాదనామక్రియ.

మ్బ్యకంమంపు:—7వ పుట.

:! విధీ! యిటుల లిఖించితే నాయలికముః ॥హా॥ ఈవిపరీతముగలుగు
నను చు నాభావమునన్ దలపోయన్నై తిగా ... ... ॥హా॥
పావన మగునీదర్శనభాగ్యమైనఁ గలుగక నాపాపమిటులఁ బండెనా?
పరమపురుష! పద్మగర్భ॥ హా॥

అనుబంధము. 12.

(కుశలవనాటకములో "కుశా! నిశపతిసమపదనా." అనుమాదిరి)

మార్కండేయుఁడు:—16వ పుట.

మోముని కులసుత్రామా! సకలాఘురహితశీయమా! విమలగుణకలా-
పా॥స॥ ముద మొదవఁగమీపదసరసిజముల్ మృదు ... పదసరసి
జముల్ మదిన్ నదలకఁ గదియిం ... తున్ ॥సమో॥

అనుబంధము. 13.

హిం—తోడి—త్రిశ్రజాతి.

శారద్వతుఁడు:—18వ పుట.

హాపాఠులార! పత్రపుష్పాపచయముఁ గావింపసరగునఁ బోదము ॥స॥
జగదీశుం డగునీశ్వరు నర్చింపగ మనగురువుల కొసఁగుదము ॥సహా॥
కేతకి, గొజ్జంగి, కేదార, మందార, చూత, భల్లాత, కామ్రాత,
పిసూకము, లాతతభక్తిఁ గుశాగ్రముల్, సమిధలఁ జేతోముదం
బునఁ జేకొనస రం డిటు॥సహాపాఠులార॥

అనుబంధము. 14.

నాదనామక్రియ—రూపకము.

అందఱు:—21వ పుట.

శివ! శివ! శివ! శంభో! గౌరీవర! సకలేశ్వర! ॥శివ॥

భవలతాలవిత్రా! సుచరిత్రా రిపుజైత్రా! పవిత్రవిమలాంగ! నిట
లాక్షా! పాహి! గంగాధర! హర! ॥శివ॥
సన్నుతిఁ జేసెద నిన్నుఁ బ్రసన్నహృదయ! బ్రోవుముదయఁ గన్నడ
సేయకుమయ్యా! పన్నగభూషణ! శంకర! ॥శివ; శివ!॥

అనుబంధము. 15.

బారువ-ఆది.

మార్కండేయుఁడు:—23వ పుట.

అకళంకుం డగుదేశికుకడ నే నభ్యసించితిని జనకా సకలశాస్త్రములు
సర్వాగమములు ప్రకటితసూత్రాధికగ్రంథంబులు ॥అక॥ చదివిన
దానికి సారముఁ గంటిని విద్యకు వినయమె భూషణ మనుచున్,
ముదమున ననుగురుఁ డెద దీవించెనొ సదయునిశంకరుఁ దయ
గ్గొలుటచే ॥అ॥

అనుబంధము. 16.

ఆనందభైరవి-మిశ్రజాతిఆట.

మార్కండేయుఁడు:—24వ పుట.

పరమేశ్వరుని భజియింపవలె దండ్రీ! శతవర్షములు సంపూర్ణమై, ధృతిఁ
దూలి శ్రీమలం బడక మును ॥పర॥ పరమున్, గనగన్ కరుణాక
రునిన్ హరునిన్ సకలేశు గంగాధరుని శివు॥ పర॥ బాహాసుతులు
పైబడి యేడ్వకమున్నే! తవిలి యమదూత లలసటఁ బరుపక ము
న్నే! గళములోఁబడి భూతపంచకగతులు మాఱ్పడిపోకమును॥ పర
మేశ్వరు॥

అనుబంధము. 17.

జంఝాటి-త్రిశ్రగతి

మార్కండేయుఁడు:—25వ పుట.

కారణ మేమి? నాజనని కనుల నీరునింప॥కా॥
నేరక నే నేమిపాపకార్యం బొనరించితినో? సారవ హోరచమి మానె

మనసా! మనసా!॥ మా॥ సకలజగంబులు! చరాచరములు! సర్వేశు
నిదయ గల్గుటచే మనసా! వికలము గాక పెం పొందెదు నెల్లెడ
సుకృత మటంచును చూపరు లలరఁగ॥ మా॥ తల్లిదండ్రిగురుదా
రాసుతులునుఁ గల్గియనుట యే తెల్లము॥ మనసా॥ తృళ్ళిపడకు నీవి
భవముఁ గన్గొని దుర్మతములఁ దరిఁబోకుము మనసా॥ మా॥ నిరత
మీశ్వరునిసేవ లొనర్చుచు నిర్మలసుఖాస్పదం బగుకైవల్యమును
గాంచి మరల బాపనిలయం బై నపుట్టువుం జెందకుమనసా॥ మా॥

అనుబంధము. 21.

బారువ-ఏక.

మార్కండేయుఁడు:— 36వ పుట.

జయ॥ జయ॥ మృత్యుంజయ! శంకర! శివ! సకలేశ్వర! శంభో! హర
హర॥ జయ॥ జయ జయ గంగోత్తమాంగ! స్మరహర! జయ గౌరీ
రమణా! బుుషభవాహా!॥ జయ జయ।

అనుబంధము. 22.

బారువ-ఆది.

మార్కండేయుఁడు:—(తనలో) 37 & 38 పుటలు.

నీకుఁ జిరాయు వొసంగె శివుం డని నీతిమాలిగర్వింపకుమా! లోకరక్షకుని
సతము భజింపుచుఁ బారికటధర్మం బనుష్టింపుమా!॥ చిత్తమా।
జననీజనకులపాదాబ్జములకు సాష్టాంగనమస్కారంబు లొనఁగి ఘను
లగు నీబుుషులబోధ నీనెమ్మనమున నిడుకొని హరుని భజింపుము॥
చిత్తమా॥

అనుబంధము. 23.

ఆది-శుద్ధదేశి.

మరుద్వతి:—39వ పుట.

నాకుమారుపే రెదఁ దలపన్ నా కేమిదియొ తాప మగుచునుండె నిఁ

కేమిసేయుదానఁ దోఁచ దేదియు నా కేగతిని విధాతలిఖించెనో॥నాకు॥
హర! మహేశ! శ్రీధర! వరదా! కాత్యాయనీశ! దీనజనశరణ్యా!
పరమపురుష! రజతశైలాధరవర! దురితదూర! నామొర లాలింపు
ము॥ నాకు॥

## అనుబంధము. 24.

బారువ-ఆది.

మార్కండేయుఁడు:—45వ పుట.

జననీ! వినుము నామనవీ! విలపింపను నాకై మదిని ననుఁ బంపుము
ధైర్య మూని॥ ఓ ఓ ఓ ... ... జననీ॥
ధారుణిపైఁ గలబత్తెము దీరిపోవకయెమృత్యువుగోరిన యపు డరు
దెంచునె? యేరికైనఁ దలుపఁగన్॥ మృత్యుంజయుసేవకు నను మృత్యు
వేమిసేయఁ గలదు? సత్యస్థిరు లగుభక్తులఁ బ్రత్యహ మతఁడేలడే॥
జన॥

## అనుబంధము. 25.

(డైలాగ్) హిం-కాఫీ-ఆది.

46వ పుట.

I. మార్కం:—మాతా! నీవీతీరునవిలపింపక దగ దమ్మా! సతతము సర్వే
శ్వరుఁడే తోడని మతిఁదలపుము! నాపై బ్రేమగ ధృతిఁ దూల
కుసర్వమును నెఱింగియు సుతునిజీవితమునకు వెత జెందకు॥ మా॥
II. మరు:—కనుపారఁ గనినుగంటినినా యడ లుడిపెద వనినమ్మితి నన్గడ
కేనాటికి నిచట విడచియే చనియెదవా? కానలకున్॥
III. మార్కం:-తప్ప దమ్మా! ధరణిలోనన్ ధాతవ్రాసినవ్రాత లెందున్
మెప్పుడో యేవేళనో స్మృతిఁ దప్పదే నిజమగుఁ బ్రాణులకును
మాతా॥

## అనుబంధము. 35.

హిం—బ్యాగ్—ఆది.

మార్కండేయుఁడు 66వ పుట.

పురహర! గిరివర! సురమునిపూజితచరణాంబుజయుగ! సర్వేశా!॥ పుర॥
కరుణాకర! శ్రితలోకశరణ్య! కాలకంఠ! గంగాధర! జయ జయ॥
పుర॥

సా:—హేదుష్టశిక్షణ, శిష్టరక్షణ కళాపరిపూర్ణా! హేసగుణ! నిర్గుణ!
సచ్చిదానందస్వరూపా!

చరణం—సగిపరివిధముల నొరఁ జేసెడిన స్మరమక సేయకు! పరమద-
యాఘా॥ పురహర॥

## అనుబంధము. 36.

బ్యాండుమట్టు.

యముఁడు 70వ పుట.

దురహంకారా! దురితవిచారా! నిరుపమక్రూరా! నిను నిఁక సైపను
పరిమార్తుఁ ఖలా!॥ దు॥ యీ నా కరమునఁ గలపాశమ్మున నీదుజీ
వమ్ముఁ దీసి కాలిరాచిఁ నాశన మ్మొనరింతు నిదే! దుష్టా! కాఁచి
కొమ్మా!॥ దుర॥

## అనుబంధము. 37.

పూర్ణషడ్జమం—ఏక.

మార్కండేయుఁడు—72వ పుట.

హరా! పురందరార్చితపదారవింద! శ్రీధరా!॥హ॥ కారుణ్యసాగరా! క
లుషవిదూర! కామితమందార! శంకరా! భరియింపఁగఁ జాలను, య
మబాధల సాధుజనపోష॥ హరా!॥

36—9



## అనుబంధము. 38.

సురట—ఆది.

యముఁడు—74వ పుట.

లోకోదయము దయాపరత నాలోకించెను సర్వేశ్వరుకృపచే, నీకసాధ్య మగుకార్యం బేదియు, లేక యుండుఁగాకఁ బ్రకటంబుగ॥ లోక॥ నీచ రిత్రవినినను జదివినఁ జింతించినను లిఖయించినవారల నేచటుం డనిగాక పాపనిచయము స్వేచ్ఛారతి దివిఁ జేరుదురుగాక॥ లోక॥

## అనుబంధము. 39.

సురట—ఆది.

మృకం, మరు—75వ పుట.

ఆనందమానంద మాయె మహానుభావుఁడై నశంకరునికృప॥ నానంద॥ నూరాయుఁడేమగునో యనుచుఁ దలంచిన మానసాంబురుహములు వికసించెనుఁ మానుగఁ ద్రిజగంబుల యందున సన్మంగళప్రదంబై రాజిల్లగ॥ నానంద॥ హర! హర! మృత్యుంజయ! సర్వేశ్వర! హర! హర! గౌరీవర! శ్రితరక్షక! దురితదూర! నిరతముఁ 'గాపాడుము సదా! కరిచర్మాంబర! మంగళ॥ మానంద॥



# సరస్వతీగ్రంథమండలి

## రాజమహేంద్రవరము.

(ఏప్రిల్ 1923)

అధ్యక్షుఁడు — సంపాదకుఁడు

...పల్లి లక్ష్మణస్వామి. — తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి.

నవలలు—ఇతిహాసభరితములగు నవలలు—చారిత్రిక—సాంఘిక—సాంసారిక-
...నపరిశోధక—నవలలు—పుణ్యచరిత్రములు—ముచ్చటైన—బొమ్మలతో—
...లకు క్యాలికోబైండుతో రెండు మాసములకొక్కటిగా వెలువడుచుండును.

### నిబంధనలు.

1. ఇందుఁ జందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుము క్రింద ముందుగా -4-0. లు చెల్లింపవలయును.

2. ఇందు రెండేసిమాసములకొక్కటిగ వెలువడుచుండు క్యాలికోబైండుగల గ్రంథమును రు 1-0-0 వెలకుఁ జందాదారులకుఁబంపుచుందుము.

3. గ్రంథములఁ బంపుటకగు పోస్టేజి మొదలగు ఖర్చులన్నియును జందా...లే భరింపవలయును.

4. చందాదారులగువారు వెనుకటి గ్రంథములన్నియును గొనవలయునని ...మములేదు. కాని వారుకోరినచో వెనుకటి పుస్తకములు కూడఁ జందాదారుల... పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందా...లు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

5. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చు...లయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

6. సంవత్సరముచందా—అనగా ముందుప్రకటింపఁబడు ఆఱుపుస్తకములకు -2-0 లు ముందుగఁబంపువారికి ఆఱుపుస్తకములవెలకు ప్రతిపుస్తకమును ...జిష్టర్డు పారసీలుగా పంపుచుందుము. అట్లు పంపినవారికి ఆఱుపుస్తకములకు ...వలసిన మనిఆర్డరు కమీషను రు 0-12-0 లును రిజిష్టరుఖర్చు రు 0-12-0 లును ...3-0 కూడినప్పును.